# పాఠకులకు విజ్ఞప్తి


మన రైతువాణి
(త్రైమాస పత్రిక)

1992, జూన్
సంపుటి 3　సంచిక:3





సంపాదకవర్గం:
కొరటాల సత్యనారాయణ
(ఎడిటర్)
పి.మధు
వి. శ్రీనివాసరావు

వెల : రు.3.00
పేజీలు : 48
చిరునామా: ఎడిటర్, మన రైతువాణి
1-1-60/2ఇష్టికార్ మేన్షన్స్,
ఆర్.టి.సి. క్రాస్‌రోడ్స్ వద్ద (సప్తగిరి
థియేటర్ ప్రక్కన),
ముషీరాబాద్, హైదరాబాద్.

...నిక: చెక్కులు, డి.డి.లు
...రైతువాణి పేరుతో పంపగలరు.


"మనరైతువాణి" ప్రారంభించి రెండు సంవత్సరాలు నిండింది. ఇప్పటి వరకు త్రైమాస పత్రికగా పాఠకుల యొక్క ఆదరాభిమానాలను చూరగొన్నది.

ఆధునిక వ్యవసాయ పద్ధతులు, రైతాంగ సమస్యలు, వ్యవసాయ సంబంధాలలో వస్తున్న మార్పులు గురించి ఎప్పటికప్పుడు సమాచారాన్ని అందిస్తూ వస్తున్నది. శాస్త్రీయ అవగాహన కలిగిన "మనరైతువాణి" రైతుల పత్రికగా అనతి కాలంలోనే రాష్ట్రవ్యాపితంగా ఆదరణకు నోచుకున్నది.

అనేకమంది పాఠకులు, ఉద్యమ కార్యకర్తలు"మన రైతువాణి"ని మాసపత్రికగా మార్చమని కోరుతూ వచ్చారు. ఆ అవసరం పెరుగుతూ వస్తున్నప్పటికీ రాష్ట్రకేంద్రంలో వున్న పరిమితమైన వనరుల దృష్ట్యా ధైర్యం చేయలేక పోయాము.

రైతుల, రైతు ఉద్యమ అభిమానుల, కార్యకర్తల అండతో ప్రోత్సాహంతో వచ్చేసంచిక నుండి మాసపత్రికగా "మన రైతువాణి" మీముందు ఉండబోతున్నదని చెప్పడానికి సంతోషిస్తున్నాము.

ఇప్పటి వరకు ఆదరించిన విధంగానే భవిష్యత్తులో కూడా పాఠకులు, శ్రేయోభిలాషులు, ప్రకటనకర్తలు ఆదరించగలరని, మనరైతువాణిని రైతులవాణిగా ప్రోత్సహించగలరని విశ్వసిస్తున్నాము.

**చందా వివరాలు:-**

| | |
|---|---|
| సంవత్సరచందా | రు. 30-00 |
| విడిప్రతి | రు. 3-00 |

(గమనిక:- ఇప్పటికే చందాలు కట్టిన వారి డబ్బును సంవత్సర చందాలో అడ్జస్ట్ చేయగలము. మిగతా డబ్బును కూడా పంపగలరని ఆశిస్తున్నాము) చందాలు డి.డి.లు చెక్కుల రూపంలో పంపేవారు ఇకనుండి ఈక్రింది అడ్రసుకి పంపించగోర్తాము.

ఎడిటర్, మన రైతువాణి,1-1-60/2 ఇష్టికార్ మేన్షన్స్,
ముషీరాబాద్, హైదరాబాద్.

## ఆంధ్రప్రదేశ్ రైతు సంఘం రాష్ట్ర కార్యాలయం హైదరాబాద్‌కు మారింది

ఆంధ్రప్రదేశ్ రైతు సంఘం 14వ రాష్ట్ర మహాసభలో రాష్ట్ర కేంద్రాన్ని విజయవాడనుండి హైదరాబాద్‌కు మార్చాలని నిర్ణయం తీసుకొనడం జరిగింది. ఇకనుండి ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపే వారు, అన్ని జిల్లాల బాధ్యులు ఈక్రింది అడ్రసుకు సంప్రదించాలని కోరుతున్నాము.

**ఆంధ్రప్రదేశ్ రైతు సంఘం రాష్ట్ర కార్యాలయం,**
**1-1-60/2ఇష్టికార్ మేన్షన్స్,**
**ఆర్.టి.సి. క్రాస్‌రోడ్స్ వద్ద (సప్తగిరి థియేటర్ ప్రక్కన),**
**ముషీరాబాద్, హైదరాబాద్.**

...పత్రికగా' "మనరైతువాణి"ని ఆదరించండి

లోపలి పేజీల్లో.....





# మీకు తెలుసా?

భూగోళానికి ప్రమాదంపెరుగుతున్నదని, దాన్నికాపాడేందుకు తీసుకోవాల్సిన చర్యలు గురించి చర్చించేందుకు బ్రెజిల్ రాజధాని రియో డిజినీరోలో ప్రపంచాధినేతల శిఖరాగ్ర సమావేశాలు జరిగాయి. ఇవి జూన్ 3 నుండి ప్రారంభమైనాయి. 50 వేలమంది ప్రతినిధులు యిందులో పాల్గొన్నారు. మన ప్రధాని కూడా పాల్గొని ప్రసంగించారు. సభలు 14న ముగిశాయి.

*ఈ భూగోళసభ (ఎర్త్ సమ్మిట్)ల్లో అమెరికా ఒంటరి పాలైంది. 2 వేల సం॥ నాటికి భూగోళంపై కాలుష్యాన్ని 1990 నాటిస్థాయికి తగ్గించాలన్న ప్రపంచ దేశాల డిమాండ్‌ను అమెరికా అంగీకరించలేదు.

*అన్ని దేశాల్లోని అటవీ సంపదపై తన పెత్తనాన్ని సాధించేందుకు వాటిని ప్రపంచ ఆస్తిగా మార్చాలని అమెరికా ప్రతిపాదించింది. భారతదేశంతో సహా అన్ని దేశాలు దీన్ని వ్యతిరేకించాయి.

*ఈ సభల్లో బయోడైవర్శిటీ (మొక్కలు, జంతువుల్ని రక్షించే) ఒప్పందం చేసుకోవాలని, దీనికి ప్రపంచ నిధిని ఏర్పాటు చేయాలని భారతదేశం ప్రతిపాదించింది. మెజారిటీ దేశాలు దాన్ని అంగీకరిస్తున్నాయి.

**భూగోళానికి వస్తున్న ప్రమాదం ఎలాంటిది?**

*రసాయనాలు, నేలకోత వలన భూసారం 11 శాతం తగ్గింది.

*అడవుల నరికివేత వలన ఎడారులు ఏర్పడుతున్నాయి.

*ప్రపంచంలో 70 శాతంపైగా ప్రజలకు మంచినీటి సదుపాయంలేదు. 10 శాతం నదులు కలుషితమైనాయి.

*ప్రతిరోజు ప్రపంచంలో 100 కోట్లమంది ప్రజలు కలుషిత వాయువు పీలుస్తున్నారు. దీనివలన రోగాలు వస్తున్నాయి.




*కొన్నిరకాల వాయువుల విడుదల వల్ల భూగోళం వేడెక్కుతోంది. దీన్ని 'గ్రీన్ హౌస్ ఎఫెక్ట్' అంటున్నారు. ఒక శతాబ్ద కాలంలో భూమి ఉష్ణోగ్రత 4 నుండి 9 ఫారన్‌హీట్ డిగ్రీల వరకు పెరగవచ్చు.

*ప్రపంచ గ్రీన్‌హౌస్ వాయువుల్లో 25 శాతాన్ని అమెరికా ఒక్కటే విడుదల చేస్తున్నది. ఏడు పారిశ్రామిక దేశాలు 45 శాతం ప్రమాదకరమైన వాయువులను విడుదల చేస్తున్నాయి.

*మరో 20-30 సంవత్సరాలలో భూమిపై గల జంతు, వృక్ష జాతులలో నాలుగోవంతు నాశనమౌతాయని అంచనా.

*సమశీతోష్ణ మండలాల్లో 2 వేల సంవత్సరాల నాటికి 1
శాతం ఓజోన్ పొర నాశనమౌతుందని అంచనా. ఈ ప్రాంతాలల
చర్మక్యాన్సర్ వ్యాధులు, దుర్భిక్షాలు 26 శాతం వరకు పెరగవచ్చ
అంచనా.

*అంటార్కిటికాపై ఓజోన్ పొరకు పెద్ద కంత పడి
దక్షిణ భారతదేశంలో కూడా ఓజోన్ పొరకు కంతప
విపరీతంగా పెరుగుతున్నది.

*గల్ఫ్ యుద్ధంలో చమురు లీకేజి వలన కలి
పూడ్చుకోవాలంటే 180 సంవత్సరాలైనా పడుతు

*భారతదేశంలో ప్రస్తుతం అధికవేగంతో
2.7 శాతం చొప్పున అడవులు తరిగిపోతునా
కెనడాలలో ఆమ్ల వర్షాలవల్ల అడవులు బాగా నా

*ఈ భూగోళాన్ని రక్షించేందుకు న

# రైతాంగ ఉద్యమాలకు స్ఫూర్తి మధిర మహాసభ

వి. శ్రీనివాసరావు
కార్యదర్శి, ఆంధ్రప్రదేశ్ రైతుసంఘం

ఆంధ్ర దేశ్ రైతు సంఘం 14వ రాష్ట్ర మహాసభలు 8, 9, 10 తేదీలలో ఖమ్మంజిల్లా మధిరలో అత్యంత జయప్రదంగా జరిగాయి. 8వ తేదీ ఉదయం 10.30 గంటలకు అఖిల భారత కిసాన్‌సభ ప్రధానకార్యదర్శి శ్రీ రామనారాయణ గోస్వామి పతాకావిష్కరణ చేయటంతో సభ ప్రారంభమైంది. తొలుత అమరవీరులకు సంతాపాన్ని ప్రకటిస్తూ సభమౌనం పాటించి అరుణాంజలి ఘటించింది. అమరవీరులు చూపిన బాటలో పయనిస్తూ రైతాంగ ఉద్యమాలను నడిపిస్తామని మహాసభ ప్రతిజ్ఞబూనింది. ఆహ్వాన సంఘాధ్యక్షులు శ్రీ కట్టా వెంకట నర్సయ్య ప్రతినిధులకు స్వాగతం పలుకుతూ మధిర డివిజన్‌లో సాగిన రైతాంగ ఉద్యమాలను గురించి వివరించారు. తెలంగానా సాయుధ పోరాట కాలంలో అమరులైన యోధులను స్మరించారు. రాష్ట్ర అధ్యక్షులు శ్రీ భీమిరెడ్డి నర్సింహారెడ్డి అధ్యక్షోపన్యాసం చేశారు. నేడు దేశం ఎదుర్కొంటున్న క్లిష్ట సమస్యలకు సరైన పరిష్కారం భూసంస్కరణలు అమలు జరపడం ద్వారానే లభిస్తుందని, కాని పాలకులు ఈ విషయంలో చిత్త శుద్ధితో లేరని కేవలం బూటకపు వాగ్దానాలు కురిపిస్తూ కాలం గడుపుతున్నారని ఆయన తీవ్రంగా విమర్శించారు. నీటి వనరుల కల్పనలో పాలకుల అశ్రద్ధను ఆయన నిశితంగా ఎత్తి చూపారు. రైతులు రోజురోజుకూ ఏ విధంగా దారిద్ర్యంలోకి నెట్టబడుతున్నారో చెపుతూ పోరాటం తప్ప మరో మార్గంలేదని, రాష్ట్రంలోని యావత్ రైతాంగం ఆంధ్రప్రదేశ్ రైతు సంఘం పతాకం క్రింద సమైక్యమై పోరుబాటలో సాగాలని ఆయన విజ్ఞప్తి చేశారు.

శ్రీ రామనారాయణ గోస్వామి ప్రారంభోపన్యాసం గావిస్తూ నేడు జాతీయంగా, అంతర్జాతీయంగా వస్తున్న పరిణామాలను విశ్లేషించారు. సోవియట్ యూనియన్ విచ్ఛిన్నం కావడంతో అమెరికాన్ సామ్రాజ్యవాదులు బరితెగించి వ్యవహరిస్తున్నారని, భారతదేశానికి వ్యతిరేకంగా సూపర్ 301 నిబంధనలను విధిస్తున్నారని, డంకెల్ ప్రతిపాదనలు మన దేశ స్వాతంత్ర్యం, సార్వభౌమత్వాలను హరించివేస్తాయని, వీటిని ప్రతిఘటించి పోరాడాలని పిలుపునిచ్చారు. అంతిమంగా మన దేశానికి, రైతాంగ విముక్తికి సోషలిజం మినహా మరో మార్గం లేదని ఆయన నొక్కి వక్కాణించారు. రాష్ట్ర కార్యదర్శి శ్రీ కొరటాల సత్యనారాయణ కార్యదర్శి నివేదికను ప్రవేశపెట్టారు. గత దశాబ్ద కాలంగా రాష్ట్రంలో వ్యవసాయరంగంలో వస్తున్న మార్పులను గూర్చి సోదాహరణంగా వివరించారు. వ్యవసాయంలో ఆధునికీకరణ పెరుగుతున్నందున, ట్రాక్టర్లు, ఎరువులు, పురుగు మందులు, కొత్త వంగడాల వాడకం పెరిగింది. దానితో పాటు ఉత్పత్తి ఖర్చులు పెరిగి వ్యవసాయం గిట్టుబాటు కాకుండా పోతున్నదని, కేవలం పెట్టుబడి పెట్టగలిగిన వారే వ్యవసాయం చేయగలుగుతున్నారని లేనివారు ఋణగ్రస్తులై వడ్డీ బాధలు తట్టుకోలేక భూములు కోల్పోతున్నారని చెప్పారు. అందుకు సాక్ష్యంగా 91 జనాభా లెక్కలు పేర్కొన్నారు. 1981-91 మధ్య కాలంలో సాగుదార్ల సంఖ్య 5 శాతం తగ్గి,వ్యవసాయ కార్మికుల సంఖ్య 4 శాతం పెరిగింది. ఇది వ్యవసాయ రంగం ఎదుర్కొంటున్న సంక్షోభానికి చిహ్నం. నేషనల్ ఫ్రంట్ పాలనా కాలంలో రు. 10 వేల వరకు ఋణ మాఫీ పథకం వంటి కొన్ని చర్యలు చేపట్టినా ఆ తర్వాత సమస్య మరింత తీవ్రతరమై నేడు పత్తి, పొగాకు వంటి వ్యాపార పంటలను కొనే నాథుడు లేక నిల్వలుండి పోతున్నాయని, రాబోయే కాలంలో ఈ సంక్షోభం మరింత ముదిరి సుడి గుండంలా మారుతోందని స్పష్టం చేశారు. గత మూడు సంవత్సరాలలో వ్యవసాయాభివృద్ధిలో ప్రగతి లేదని, ఈ సంవత్సరం ఖరీఫ్‌లో ఆహారోత్పత్తి తగ్గిందని, దీనికి కారణం ప్రభుత్వ అస్తవ్యస్త విధానాలేనని



మహాసభలో ప్రారంభోపన్యాసం చేస్తున్న లఖిలభారత కిసాన్‌సభ ప్రధాన కార్యదర్శి శ్రీ ఆర్.ఎన్. గోస్వామి, అధ్యక్షోపన్యాసం చేస్తున్న బి.ఎన్.రెడ్డి

ఆయన పేర్కొన్నారు.

ఈ కాలంలో రైతు సంఘం యొక్క కృషిని పేర్కొంటూ 1991లో ఎరువుల ధరలు పెరిగిన సందర్భంలో రైతు సంఘ కార్యకర్తలు ప్రతి చోటా ముందు పీఠిన వుండి దొంగ ఎరువుల్ని



బయటకు లాగి పాత దరలకే అమ్మించారని చెప్పారు. ముఖ్యంగా గుంటూరు, కృష్ణా, పశ్చిమగోదావరి, ఖమ్మం, నల్గొండ జిల్లాలో మన పాత్ర గణనీయమైంది. ఈ ఐదు జిల్లాలోనే 10-12 లక్షల బస్తాలను బయటకు లాగి పాత ధరలకు అమ్మించారు. ఆందోళన అనంతరం అందరికీ 10 శాతం తగ్గించినా నన్న, చిన్నకారు రైతుల విషయంలో ప్రభుత్వం తన వాగ్దానాన్ని నిలుపుకోలేకపోయిందని ఆయన విమర్శించారు. ఇతర సంఘాలేవీ పట్టీవంచుకోకపోయినా, పేద రైతుల తరపున మన సంఘం కొంత కృషి చేసిందని అయినా ప్రభుత్వం అమలు జరపలేదని, పేద రైతుల హక్కుల సాధన కోసం మరింత సమైక్యంగా పోరాడాల్సిన ఆవశ్యకతను ఇది తెలియజేస్తుందని చెప్పారు. పశ్చిమగోదావరి జిల్లాలో కల్తీ ఎరువుల్ని పట్టుకొని బహిర్గత పరచినందుకు కార్యకర్తల్ని ఆయన అభినందించారు. నీటి పారుదల పథకాల కోసం కర్నూలు, నల్గొండ, వరంగల్, నెల్లూరు, తదితర చోట్లజరిగిన కృషిని వివరించారు. ప్రకృతివైపరీత్యాల సందర్భాలలో రైతులకు సహాయమందించడంలో మన సంఘ కార్యకర్తలు గట్టి కృషి చేశారు. విద్యుత్ కోత తీవ్రంగా వున్న 1990-91 సంవత్సరంలో 2 సార్లు హైదరాబాద్‌కి ప్రదర్శనలు నిర్వహించి సాధించుకోవడం జరిగిఆంది. పొగాకు పత్తి చెరకు వంటి వ్యాపార పంటలకు గిట్టుబాటు ధరల కోసమై మన సంఘం ఇతర సంఘాలను కూడా కలుపుకొని ఎలా పోరాడిందీ వివరించారు. స్థానిక సమస్యలపై కృషిని పెంచాల్సిన ఆవశ్యకతను ఆయన ప్రత్యేకంగా పేర్కొన్నారు. ఐక్య కార్యాచరణ ఆవశ్యతను నొక్కి చెపుతూ, అదే సందర్భంలో స్వతంత్ర కార్యాచరణ లేకపోయినట్లైతే మన పునాది విస్తరించదని, ముఖ్యంగా పేద, మధ్య తరగతి రైతాంగం యొక్క సమస్యలపై కేంద్రీకరించాలని ఈ వర్గాలు నేడు నిర్లక్ష్యానికి గురౌతూ అటు భూస్వాముల, పెట్టుబడి దారుల, ఇటు ప్రభుత్వం యొక్క దారుణ దోపిడీకి గురౌతున్నాయని చెప్పారు. వ్యవసాయాభివృద్ధికి నివేదిక కొన్ని సూచనలు చేసింది.

1. భూసంస్కరణలను పటిష్టంగా అమలు జరపడం, వాస్తవ కౌలు దార్లను గుర్తించి కౌలుదారు రక్షణ చట్టం అమలు జరపడం, రికార్డు ఆఫ్ రైట్స్ చట్టాన్ని అమలు జరిపి పాసు పుస్తకాలు జారీ చేయటం.
2. నీటి పారుదల ప్రాజెక్టులకు, విద్యుత్ ఉత్పత్తికి అధిక ప్రాధాన్యత నిచ్చి నిధులు కేటాయించడం, మైనర్ ఇరిగేషన్ ప్రాజెక్టులను త్వరితగతిన దరఖాస్తు దారులకు విద్యుత్ కనెక్షన్స్ ఇవ్వడం.
3. సహకార, వాణిజ్య బ్యాంకుల ద్వారా పేద, మధ్య తరగతి రైతాంగానికి వ్యవసాయ రుణాలు సకాలంలో అందేటట్లు చూడడం, వడ్డీ రేటు తగ్గించి రాయితీని కొనసాగించడం.

ఖర్చులు పెరగకుండా ధరలను అదుపులో వుంచడం.

5. పంటల భీమా పథకాన్ని అన్ని పంటలకు విస్తరించి కమతం ప్రాతిపదికపై అమలు జరపడం.
6. మార్కెట్ సౌకర్యాలను కల్పించడం, ప్రభుత్వ రంగ సంస్థలు పోటీలో వుండి ధర నిలకడగా వుండేట్లు చూడటం
7. ఐ.ఎం.ఎఫ్. షరతులు, డంకెల్ ప్రతిపాదనలు, నరసింహం కమిటీ సిఫార్సులను నిరాకరించడం.

కార్యదర్శి నివేదికపై 6 గంటల పాటు చర్చ జరిగింది. 31 మంది ప్రతినిధులు పాల్గొని తమ అనుభవాలతో దీన్ని మరింత పరిపుష్టం చేశారు. కార్యదర్శి నివేదిక వాస్తవిక దృక్పథంతోనూ, విశ్లేషణాత్మకంగాను వున్నదని ఉద్యమానికి మార్గదర్శకంగా వుందని వక్తలు పేర్కొన్నారు. కృష్ణాజిల్లా ప్రతినిధులు చర్చలో పాల్గొంటూ బుడమేరు డ్రైనేజి సమస్యపై తాము సాగించిన కృషి వలన ఎలాంటి ఫలితాలు వచ్చాయో వివరించారు. దాని ద్వారా అన్ని వర్గాల రైతాంగాన్ని కదిలించి, సాధించగలిగామని ఇది మన సంఘ ప్రతిష్ఠను పెంచిందని చెప్పారు. సభ్యత్వ చేర్పింపు కార్యక్రమం, రైతువాణి చందాల పెంపులో తమ అనుభవాలను పశ్చిమగోదావరిజిల్లా ప్రతినిధులు పేర్కొన్నపుడు అందరూ ఎంతో ఉత్సాహపడ్డారు. ఖమ్మంజిల్లా భద్రాచలం నుండి మాట్లాడిన ప్రతినిధి గిరిజనులు ఏ విధంగా దోపిడీకి గురి అవుతున్నారో వివరిస్తూ ఐ.టి.డి.ఎ వంటి సంస్థలు నామకా పని చేస్తున్నాయని గిరిజనుల అభివృద్ధికి తోడ్పడటం లేదని నిధులు మింగేస్తున్నాయని విమర్శించారు. విద్యుత్ సమస్యలపై నల్గొండ జిల్లాలో సాగించిన కృషిని, మార్కెట్ యార్డుల సమస్యలపై వరంగల్‌లో జరిగిన ఆందోళన, చెరకు రైతు స్థానిక సమస్యలపై విజయనగరం, విశాఖ జిల్లాలో జరిగిన కృషి, పెన్నా, డ్రైనేజి సమస్య సీతారాంపురం రిజర్వాయర్ల కోసం నెల్లూరుజిల్లాలో జరిగిన కృషి, పొగాకు రైతు సమస్యలపై ప్రకాశంజిల్లాలోను, ఎరువుల ధర పెంపుకు వ్యతిరేకంగా గుంటూరు తదితర



జిల్లాలోనూ జరిగిన కృషిని ప్రతినిధులు వివరంగా పేర్కొన్నారు. రాష్ట్రంలో కొత్తగా విస్తరిస్తున్న మల్బరీ, వేరుశనగ పంటలు కొబ్బరి, జీడిమామిడి రైతాంగం యొక్క సమస్యలు, సంక్షోభంలో వున్న కొబ్బరి పరిశ్రమ గురించి కూడా ప్రతినిధులు పేర్కొన్నారు. నిర్మాణ రంగంలో కృషిని పేర్కొంటూ స్థానిక సమస్యలు తీసుకొని పని చేస్తువ్న దగ్గరే గ్రామ కమిటీలు నిలబడుతున్నాయని అనుభవంగా చెప్పారు. జిల్లా, డివిజన్ కేంద్రాలను బలపరచుకోవాలని, కార్యకర్తల అభివృద్ధికి రాజకీయ తరగతులు నిర్వహించాలని, రైతువాణిని మాసపత్రికగా మార్చాలని, చర్చల్లో పాల్గొన్న ప్రతినిధులు సూచించారు చర్చల అనంతరం కార్యదర్శి సమాధానం ఇచ్చారు. ఆగస్టు ఆఖరులోగా సంవత్సరం చందాలు కట్టిస్తే సెప్టెంబర్ నుండి రైతువాణి మాసపత్రికగా మనముందుటుందని ఆయన హామీ ఇచ్చారు. రాష్ట్ర కేంద్రాన్ని మరింతగా సమన్వయంతో నిర్వహించడానికి వీలుగా హైదరాబాద్‌కు మార్చాలి ఆయన

ప్రతిపాధించారు.

ప్రతినిధులు లేవనెత్తిన కొన్ని ప్రశ్నలకు సమాధానమిస్తూ, భూసమస్య అంతిమంగా వ్యవసాయక విప్లవం ద్వారానే పరిష్కారమౌతుందని, అయితే ఈలోగా ఏమి చేయలేమని అనుకోడం పొరపాటని ఎత్తిచూపారు. మిగులు భూములు, ప్రభుత్వ బంజర్లు, వగైరా సమస్యలు తీసుకొని సాధించుకోవచ్చని మన అనుభవం స్పష్టం చేస్తున్నదని గతంలో దేవాలయ భూములు విషయంలో భూములు విషయంలో కౌల్దారీ రైతులను భూముపై నిలబెట్టాగలగామని, వేలాది మంది రైతులు తాము సాగు చేసుకుంటున్న భూములకు పట్టాలు పొందగలిగారని చెప్పారు. అలగే నీటి తీరువా పెంపు సమస్యను ప్రస్తావిస్తూ ప్రభుత్వం లెక్కలు లేకుండా నోటీసులు ఇవ్వకుండా జబర్దస్తీగా వసూలు చేయాలని ప్రయత్నిస్తే రైతులు సంఘటిత పడి తిరస్కరించాని, మొదటి డిమాండ్ నోటీసులు ఇచ్చి ఆ తర్వాత సంవత్సరం వరకే పన్ను వసూలు చేయాలని, గత 5-6 సంవత్సరాలుగా వున్న బకాయిలను తేల్చిన తర్వాత వాయిదాల పద్ధతిపై చెల్లించేందుకు అవకాశం ఇవ్వాలని డిమాండ్ చేయాలని సూచించారు.

చర్చల అనంతరం మొత్తంగా ఉద్యమాన్ని సమీక్షించి చూసినపుడు మన ఉద్యమం రాష్ట్రంలో విస్తరించినందని, రైతుల్లో తనపలుకుబడిని పెంచుకోగలిగిందని స్పష్టమైంది. పెరిగిన పలుకుబడికి అనుగుణంగా నిర్మాణ పటిష్టపరుచుకోవడమనేది ఉద్యమం ముందున్న కర్తవ్యం.


బోడేపూడి వెంకటేశ్వరరావు
అధ్యక్షులు


వి. శ్రీనివాసరావు
కార్యదర్శి

అనంతరం ప్రతినిధులు నివేదికను ఏకగ్రీవంగా ఆమోదించారు.

మహాసభ జరుగుతున్న కాలంలోనే మధ్యలో నల్గొండజిల్లా సూర్యాపేట డివిజన్ నాగులపాటి అన్నారంలో వ్యవసాయ కార్మిక సంఘం కార్యకర్త కా॥ ఎస్. సైదయ్యను హత్య చేసిన వార్త చేరింది. ఈ వార్త అందగానే మన నాయకులు బి.ఎన్.రెడ్డి తదితరులు హుటాహుటిన సూర్యాపేట బయలుదేరి వెళ్ళారు. 10వ తేదీ ఉదయం సభ ప్రారంభం కాగానే సంతాప తీర్మానం ఆమోదిస్తూ మహాసభ కాంగ్రె, నక్సలైట్ల దురాగతాలను ఖండించింది. గత సంవత్సర కాలంలో నల్గొండ జిల్లాలో ఈ రాక్షసులు ప్రజాతంత్ర ఉద్యమ నాయకులు ఏడుగుర్ని పొట్టన పెట్టుకున్నారు. ఇదే గ్రామస్తుడు శ్రీ ధియాకుల గురవయ్యను కొద్ది రోజల క్రితమే కత్తులతో పొడవగా కోలుకొని తిరిగి కార్యకాలపాల్లో పాల్గొంటూ ఈ మహాసభకు ప్రతినిధిగా కూడా హాజరైనారు. నల్గొండజిల్లాలో పెరుగుతున్న నిర్బంధం పట్ల ప్రతినిధుంతా ఆగ్రహం చెందారు. దాడులను ఎదుర్కొని పోరాడుతున్న కామ్రేడ్స్‌కు, ప్రజకు ప్రతినిధులు తమ సంఘీభావాన్ని ప్రకటించారు.

ఈ జిల్లాలో ప్రజాతంత్ర ఉద్యమాన్ని దెబ్బకొట్టడానికి మంత్రి దామోదరరెడ్డి, సి.ఐ. లక్ష్మిరెడ్డి నాయకత్వన పోలీసులు, గుండాలు, నక్సలైట్లు ఐక్యమై ఎలా భీభత్సాన్ని సృష్టిస్తున్నారో ఈ సంఘటనలు విదితం చేస్తున్నాయి.

ఆంధ్రప్రదేశ్ రైతు సంఘం (హైదరాబాద్) తరపున వల్లూరి రంగాదరరావు ప్రారంభ సభకు హాజరై సందేశమిచ్చారు. ఉభయ సంఘాల మధ్య ఐక్యతను పేర్కొంటూ రెండు సంఘాలు విలీనమవ్వాలని ప్రతిపాదించారు. కేవలం ప్రతిష్ట మాత్రమే ఇందుకు అడ్డంకి అవుతున్నదని చెప్పారు. శ్రీ కొరటాల సత్యనారాయణ దీనికి ప్రతిస్పందిస్తూ ముందు ఉభయ సంఘా మధ్య కార్యచరణ సాగాలని కలసి పనిచేస్తేకలిసి పోవడం గురించి ఆలోచించ వచ్చునని సూచించారు. అయినా ఇది అఖిల భారత్ స్థాయిలో జరగాల్సిన చర్చ అని మన నాయకత్వాలకు ఈ విషయం తెలియజేద్దామని చెప్పారు. ఇప్పటి వరకు ఏకాభిప్రాయం వున్న అనేక సమస్యలపై ఎందుకు కలసి పనిచేయలేకపోయామూ ఆత్మపరిశీలన చేసుకోవాలని పొరపాటు ఎవరివైపు వున్నాదిదిద్దకోవాలని, మాకు సంబందించినంతవరకు చిత్తశుద్ధితో కృషి సాధించామని వివరించారు. అవసరమైతే సమస్యలను ఉభయ నాయకత్వాల స్థాయిలో కలిసి కూర్చొని చర్చించుకోవాలని శ్రీ కొరటాల సూచించారు.

9వ తేదీ సాయంత్రం వ్యవసాయక సమస్యలపై జరిగిన సెమినార్ ప్రతి ఒక్కరిని ఆకట్టుకున్నది. ఎన్నో విషయాలపై వివరణ లభించినది. ముఖ్యంగా రాష్ట్రంలో ఏ విధంగా వనరులున్నాయో వాటిని ఉపయోగించుకోవడంలో మనమెలా వెనుకబడుతున్నామో వక్తలు సోదాహరణంగా పేర్కొన్నారు. అయితే వీరు చెప్పిన ప్రతి విషయంలోను మనం ఏకీభవించలేకపోవచ్చు. కాని ఆలోచించవలసిన విషయాలు అనేకం ఉన్నాయి. రిటైర్డ్ చీఫ్ ఇంజనీరు డా॥ శ్రీ రామకృష్ణయ్య మాట్లాడుతూ రాష్ట్రంలో వెనుకబడిన ప్రాంతాలకు నీటి వనరులు ఎలా కల్పించవచ్చునో చెప్పారు. కేవలం ప్రభుత్వ అశ్రద్ధ కారణంగానే ప్రాజెక్టుల పని వెనుక బడిపోతున్నదని ఆయన విమర్శించారు. దక్షిణాది నదుల అనుసంధానం నష్టకరమైన ప్రతిపాదనని, కేవలం రాజకీయ ప్రయోజనాల నాశించి ఇది లేవనెత్తబడిందని ఇందులో కేంద్ర స్థాయిలోని కొందరు అధికారుల పాత్ర కూడా వుండొచ్చు ఆయన సందేహం వెలిబుచ్చారు. వ్యవసాయ విశ్వవిద్యాలం రిసెర్చి సెంటర్ డైరెక్టర్ డా॥ ఐ.వి. సుబ్బారావు ప్రసంగిస్తూ ప్రస్తుత మనదేశం 17కోట టన్నుల ఆహార ధాన్యాలను ఉత్పత్తి చేస్తుంద ఈ శతాబ్ది అంతానికి 24 కోట్ల టన్నులు అవసరమౌతుందని దాని ఎలా సాధించాలని ప్రశ్నించారు. ఆధునిక పద్ధతుల వ్యవసాయాభివృద్ధికి సాధించాలని అంటూ అందుకు అవసరమై సూచనలుచేశారు. వ్యవసాయ విస్తరణ కార్యక్రమం క్రింది దా పోవడం లేదని భూసయ్య్య విషంలోను వ్యవస్థాపక మార్పు చేపట్టాని ఆయన కోరారు. డా॥ కె.ఆర్.చౌదరి మాట్లాడుత వ్యవసాయంలో పెరుగుతున్న ఉత్పత్తి ఖర్చులను తత్ఫలితం పెరుగుతున్న దారిద్ర్యం, నిరుద్యోగం, ఋణబారాల గురిం పేర్కొన్నారు. అఖిలభారత కిసాన్‌సభ నాయకులు డా॥ విప్లవదాస్‌గు నూతన ఆర్థిక విధానాలు రైతాంగాన్ని ఏవిధంగా దెబ్బతీస్తాయ సవివరంగా పేర్కొన్నారు. డంకెల్‌ప్రతిపాదను దేశ స్వావలంబన దెబ్బతీస్తాయని, రైతాంగం పోరాడి సాధించుకున్న హక్కులు కూ

కోల్పోయి పరాధీనుయ్యే అవకాశం వుందని హెచ్చరించారు. సభకు శ్రీ కొరటాల సత్యనారాయణ అధ్యక్షత వహించారు. ఈ సెమినార్ మారుతున్న వ్యవసాయ ఉత్పత్తి పద్ధతును, సంబంధాలను అర్థం చేసుకోవడానికి ప్రతినిధులకు దోహదపడింది.

నేడు రాష్ట్రంలో రైతాంగం ఎదుర్కొంటున్న పలు సమస్యలపై తీర్మానాలు ఆమోదించబడ్డాయి. అర్హత కమిటీ తన నివేదికను ప్రవేశపెట్టింది. మహాసభకు 19 జిల్లాల నుండి 2,30,478 సభ్యత్వానికి ప్రాతినిధ్యం వహిస్తూ, 340 మంది ప్రతినిధులు హాజరైనారు. ఇందులో 22 మంది మహిళలు, సభకు హాజరైన ప్రతినిధులలో 96 మంది 35 సంవత్సరాల లోపు వయసున్నవారే. 60 సంవత్సరాలపైబడిన వారు 35 మంది వున్నారు. ప్రతినిధులులో 115 మంది ఇంటర్ ఆపైన చదువుకున్నవారు. నిరక్షరాస్యులు 5 గురు మాత్రమే వున్నారు. పేద, మధ్య తరగతి రైతులు 253 మంది వున్నారు. అసలు భూమిలేని వారు 38 మంది వున్నారు. 1978 తర్వాత రైతు సంఘంలో చేరినవారు 240 మంది వున్నారు. పశ్చిమగోదావరికి చెందిన ఒక ప్రతినిధి తాను ఒక్కడే రైతువాణి 500 చందాలు చేర్పించాడు.

మహాసభ 63 మందితో నూతన కార్యవర్గాన్ని, 12 మంది ఆఫీసు బేరర్లను ఎన్నుకున్నది. సెప్టెంబర్ ఆఖరివారంలో ఇస్సార్‌లో జరుగనున్న 27వ అఖిలభారత మహాసభకు ప్రతినిధులుగా 50మందిని ఎన్నుకున్నది.

మహాసభకు అర్హతల కమిటీగా శ్రీ పోపూరి రామారావు, శ్రీ ఎం. వాగిరెడ్డి, శ్రీ డి.వి. కృష్ణగారలు, మినిట్స్ కమిటీగా శ్రీ సి.హెచ్. రాజగోపాల్, శ్రీ బి. తులసీదాస్, శ్రీ సామినేని రామారావుగారలు, తీర్మానాల కమిటీగా శ్రీ వై. కేశవరావు, శ్రీ టి. నరసింహయ్య, శ్రీ సి.హెచ్. రాజారెడ్డి, శ్రీ బి. చంద్రారెడ్డిగార్లు వ్యవహరించారు.

రాష్ట్ర కార్యవర్గ సభ్యులను జిల్లాల వారిగా చూచినట్లయితే బి. తులసీదాస్(శ్రీకాకుళం), ఎం. సూర్య నారాయణ(విజయనగరం), ు. జగన్నాథం (విశాఖ), ఎన్. విశ్వనాథం (తూర్పుగోదావరి), ఆర్. సత్యనారాయణరాజు, భోగవల్లి రాజారావు, కరుటూరు సత్యనారాయణ, ). శ్రీరామమూర్తి, తాళం సూర్యనారాయణ (పశ్చిమ గోదావరి), ? . కేశవరావు, ఎస్. విజయసారధిరావు, డి.వి. కృష్ణ, ఎస్. నాగేశ్వరరెడ్డి, . ఉమాకృష్ణ ప్రసాద్ (కృష్ణ), పుతుంబాక వెంకటపతి, ఎస్. వారెడ్డి, పోకూరి రామారావు, ఆవుల ఆంజనేయులు, భీమిరెడ్డి ంబిరెడ్డి (గుంటూరు), సూరాపాపిరెడ్డి, ఎన్. రంగారావు, పమిడి ్టయ్య (ప్రకాశం), వంద్ర రాజగోపాల్, బి. మాలకొండారెడ్డి వెల్లూరు), హరికృష్ణ (చిత్తూరు), జడ్. వీరారెడ్డి, పి. హంపిరెడ్డి అనంతపురం), టి. నరసింహయ్య, టి మద్దులు, టి. రామకృష్ణ కర్నూలు); వనగంటి ఈశ్వర్, ఎం. నాగిరెడ్డి (మ॥నగర్), పి. ంగారెడ్డి, కె.జంగారెడ్డి (రంగారెడ్డి), బండి దత్తాత్రి (ఆదిలాబాద్), స్. మల్లారెడ్డి, సి.హెచ్. రాజారెడ్డి, సూడి కృష్ణారెడ్డి, ఎం. ారాయణరెడ్డి, మున్న నారాయణ(వరంగల్), కె.ఎల్. నరసింహరావు, పం నరసింహారావు, కట్టా వెంకట నరసయ్య, సామినేని రామారావు, తిస రాఘవయ్య, శ్యామల వెంకట రెడ్డి, కుమరం లక్ష్మినారాయణ ామ్మం), అరిబండి, లక్ష్మి నారాయణ, బొంతల చంద్రారెడ్డి, రెడ్డి, చంద్రయ్య, ఉప్పుల కాంతారెడ్డి, ...-జనార్థనరెడ్డి, గుండా ్శరెడ్డి, జి. అంజిరెడ్డి (నల్గొండ), మల్లు స్వరాజ్యం, పుతుంబాక ఠతి, కె. స్వరూపరాణి, మచ్చాలక్ష్మి (మహిళలు), రాష్ట్ర కేంద్రం నుండి కొరటాల సత్యనారాయణ, పి. మధు, వి. శ్రీనివాసరావు, జె. బాబూరావు.

మహాసభ ఈ క్రింది తీర్మానాలను చేసి ఆమోదించింది. 1. సంతాప తీర్మానం. 2. చెరకు సమస్యపై తీర్మానం 3. కేంద్ర ప్రభుత్వ నూతన ఆర్థిక విధానాలకు వ్యతిరేకంగా తీర్మానం, 4. భూ సమస్యపై తీర్మానం, 5. పట్టాదారు పాసు పుస్తకాలపై తీర్మానం, 6. రాష్ట్ర విద్యుత్ సమస్యలపై తీర్మానం, 7. గిట్టుబాటు ధరలపై తీర్మానం 8. పంటల భీమాపై తీర్మానం 9. క్యూబాకు సంఘీభావంగా 10. నీటి పారుదలపై తీర్మానం, 11. రాష్ట్ర సమస్యలపై తీర్మానం, 12. పటేల్-పట్వారీ వ్యవస్థపై 13. పంటల తెగుళ్ళపై తీర్మానం 14. చీమకుర్తి ఘటనపై తీర్మానం.

మహాసభ 12 మంది ఆఫీసు బేరర్లను ఎన్నుకుంది. అధ్యక్షులుగా శ్రీ బోడేపూడి వెంకటేశ్వరరావు కార్యదర్శిగా శ్రీ వి. శ్రీనివాసరావును, ఉపాధ్యక్షులుగా శ్రీయుతులు కొరటాల సత్యనారాయణ, బి.ఎన్. రెడ్డి, పుతుంబాక వెంకటపతి, ఎస్. మల్లారెడ్డి, టి. నరసింహయ్య, సహాయ కార్యదర్శులుగా పి. మధు, వై. కేశవరావు, ఆర్. సత్యనారాయణరాజు, టి.చంద్రారెడ్డి, వనం నరసింహారావులు ఎన్నికయ్యారు.

ఈ మహాసభలను జయప్రదం చేయడంలో ఆహ్వాన సంఘం కొనియాడదగిన కృషి చేసింది. మధ్యలో కా॥ ఎం.బి., కా॥ ఏలూరి వంటి నాయకులు మృతి చెంది కొన్ని అవాంతరాలు వచ్చినా, ఎండలు తీవ్రంగా ఉండి, పెళ్ళిళ్ళు ముమ్మరంగా సాగుతున్నా, కార్యకర్తు అకుంఠిత దీక్షతో ప్రతినిధులకు ఏ అసౌకర్యం కలుగకుండా అన్ని జాగ్రత్తలు తీసుకున్నారు. ఆఖరి రోజున ప్రదర్శన, బహిరంగ సభా జరిగాయి. ఈ మహాసభను జయప్రదం చేయడంలో ఆంధ్రప్రజానాట్యమండలి కృషి ప్రత్యేకంగా పేర్కొనబడింది. గ్రామ గ్రామానా రైఉ నాటికను ప్రదర్శించారు. ఈ మూడు రోజులలో సాంస్కృతిక ప్రదర్శనలనిచ్చి అందరి అభిమానాలను చూరగొన్నది. వ్యవసాయశాఖ జిల్లా కేంద్ర సహకార బ్యాంకు ఆగ్రోస్, సమాచార శాఖవారు ఏర్పాటు చేసిన ఎగ్జిబిషన్ ఎంతో విజ్ఞానదాయకంగా వున్నాయి. తెలంగాణా పోరాటంపై ప్రత్యేక చిత్ర ప్రదర్శనను ఏర్పాటు చేశారు. మొత్తం మీద ఈ మహాసభ రైతాంగ ఉద్యమానికి ఒక దిక్సూచిలా ఉపయోగపడిందని చెప్పవచ్చు. ప్రస్తుతం కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు అనుసరిస్తున్న దివాళా కోరు విధానాలను ఎండగట్ట, మన మహాసభ సూచించిన ప్రత్యామ్నాయ ప్రతిపాదనలను విస్తృతంగా ప్రచారం చేసి రైతాంగాన్ని కూడగట్టడం మన ముందున్న తక్షణ కర్తవ్యం.

## కామ్రేడ్ సైదయ్యకు సహాయనిధి

కామ్రేడ్ సైదయ్య కుటుంబ సహాయ నిధికి కామ్రేడ్ కొరటాల సత్యనారాయణ పిలుపునివ్వగా అక్కడికక్కడే రు. 4 వేలు వసూలు అయ్యాయి. అంతేగాకుండా ఆ జిల్లా ఉద్యమ ఉద్యమ రక్షణ నిధికి తమవంతు బాధ్యతగా సహాయం చేయటానికి అన్ని జిల్లాలు ముందుకొచ్చాయి.

# రైతాంగ ఉద్యమానికి మార్గదర్శి మన కామ్రేడ్ మాకినేని

రైతువాణి శ్రద్ధాంజలి

–కొరటాల సత్యనారాయణ

భారతదేశంలో రైతాంగ ఉద్యమానికి స్ఫూర్తినిచ్చి దానికి అడుగడుగునా మార్గదర్శకత్వం వహించిన నేత కామ్రేడ్ మాకినేని బసవపున్నయ్య. అఖిలభారత కిసాన్ సభ ఉపాధ్యక్షునిగా దీర్ఘకాలం పని చేసి చనిపోయేనాటికి కేంద్ర కౌన్సిల్ సభ్యునిగా వుంటూ ఏప్రిల్ 12వ తేదీన న్యూఢిల్లీలో ఆఖరి శ్వాస విడిచి, మనలనందరినీ దుఃఖసాగరంలో ముంచారు.

కా॥ బసవపున్నయ్య 1914 డిశంబర్ 14న గుంటూరు జిల్లా రేపల్లె తాలూకా తూర్పుపాలెం గ్రామంలో ఒక భూస్వామ్య కుటుంబంలో జన్మించారు. గుంటూరు ఎ.సి. కాలేజీలో గ్రాడ్యుయేషన్ చేస్తూ విద్యార్థి ఉద్యమాలకు నాంది పలికారు. ఆనాడు ఆయన సృష్టించిన వారసత్వమే విద్యార్థి ఉద్యమాలకు నిలయంగా ఎ.సి.కాలేజి మారడానికి దోహదపడింది. 1937 నుండి 40వరకు రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ ప్రధాన కార్యదర్శిగా పనిచేశారు. ఆ తర్వాత గుంటూరు జిల్లా పార్టీ కార్యదర్శిగా ఎన్నికై, ఆ జిల్లా ఉద్యమాభివృద్ధికి ఎంతగానో కృషి చేశారు. 1943 నుండి భారత కమ్యూనిస్టు పార్టీ రాష్ట్ర కమిటీలోనూ, కార్యదర్శివర్గంలోనూ వుంటూ రాష్ట్ర ఉద్యమాభివృద్ధికి ఎనలేని కృషి చేశారు. ఆ తర్వాత అఖిల భారత నాయకునిగా కేంద్రంలో వుంటూ అన్ని రాష్ట్రాలకు తన మార్గదర్శకత్వాన్ని, అనుభవాలను అందించారు.



మాకినేని బసవపున్నయ్య

1946లో ప్రారంభమై 51తో ముగిసిన తెలంగాణా సాయుధ పోరాటానికి నాయకత్వం వహించిన సారథుల్లో కామ్రేడ్ సుందరయ్యతో పాటు మాకినేని కూడా ఒకరు. స్వాతంత్ర్యానంతరం నాడు మారిన నూతన పరిస్థితులలో పోరాటాన్ని కొనసాగించడమా? లేదా? అన్న ప్రశ్న వచ్చినపుడు ఒకవైపు కాంగ్రెస్‌తో నేస్తం కట్టాలన్న రివిజనిస్టుల వాదనలను ఎండగడుతూనే మరోవైపు సాధించిన విజయాలను కాపాడుకునేందుకు జాగ్రత్తగా వెనకడుగువేసి ఉద్యమాన్ని రక్షించేందుకు ఏవిధంగా పార్టీ నడవాలో ఆలోచించి అందుకు అనుగుణంగా ఎత్తుగడలు రూపొందించడంలో సుందరయ్యతో పాటు మాకినేని కూడా ముఖ్యులు. ఆనాడు తలెత్తిన విభేదాల నేపథ్యంలో కేంద్ర నాయకత్వంతో కూడిన ప్రతినిధి బృందం నలుగురిలో కామ్రేడ్ బసవ పున్నయ్య కూడా వుండి రహస్యంగా మాస్కో చేరి స్టాలిన్ తదితర అంతర్జాతీయ నాయకులతో చర్చలు జరిపి వచ్చారు. ఆ అనుభవాల ఆధారంతో తెలంగాణా పోరాటంపై ఒక అవగాహనకు వచ్చి, పోరాటాన్ని విరమించారు. ఆ తర్వాత 1952 ఎన్నికల్లో కమ్యూనిస్టు పార్టీ అఖండ విజయాలను సాధించింది. కాని 1955 ఎన్నికల్లో కమ్యూనిస్టు వ్యతిరేక కూటమి ఏర్పడింది. పోలింగ్ జరగడానికి కొద్ది రోజుల ముందే పరిస్థితిని గ్రహించి ఓటమి తప్పదని, దీనికి మనం మానసికంగా సిద్ధంగా వుండాలని ఆయన నన్ను హెచ్చరించారు. అదే జరిగితే ఎన్నికలనంతరం పార్టీ చెదిరిపోకుండా ఎలా నిలబెట్టుకోవాలని కూడా ఆయన దీర్ఘంగా ఆలోచించే వారు. ఈ ఎన్నికల సందర్భంగా ఆయనతో కూడా సన్నిహితంగా తిరిగే, అవకాశం నాకు లభించింది. ఆ సమయంలో ఆయన ఆలోచనల ప్రత్యేకత ఎన్నికలనంతరమే నాకు అర్థమైంది. ఎన్నికల ఓటమితో వచ్చిన నిస్పృహతో పార్టీలోని ఒక భాగం రివిజనిజం వైపు మొగ్గు చూపినపుడు దాన్ని ఎదుర్కొని కామ్రేడ్ ఎం.బి. గట్టిగా నిలబడ్డారు. అంత దూరదృష్టితో విషయాలను, ఘటనలను పరిశీలించి భవిష్యత్‌ను అంచనా కట్టేవారు. అందువలనే ఆయన భారతదేశ విప్లవ రాజకీయాలలో దిట్ట కాగలిగారు.

మార్క్సిజాన్ని, లెనినిజాన్ని లోతుగా అధ్యయనం చేయడమేకాకుండా దాన్ని భారతదేశ నిర్దిష్ట పరిస్థితులకు వర్తింప జేయడంలో కూడా ఆయన ఆరితేరిన సిద్ధాంతకర్తగా గుర్తింపు పొందారు. ఈ విషయాల్లో పార్టీ కీలక పత్రాలన్నింటిలోనూ, ఇతరులతో పాటు వీరిది కీలకపాత్ర అనే విషయం నేడందరికీ తెలిసిందే.

1979 ఏప్రిల్‌లో వారణాసిలో 23వ అఖిలభారత కిసాన్ మహాసభ జరిగింది. ఈ మహాసభలో స్వాతంత్ర్యానంతరం

వ్యవసాయరంగంలో వచ్చిన మార్పుల్ని గురించి చర్చించి కొన్ని నిర్ధారణలకు రావడం జరిగింది. అవి (1) స్వాతంత్ర్యానంతరం అధికారంలోకి వచ్చిన బడా బూర్జువా, భూస్వామ్య వర్గం తన వర్గ ప్రయోజనాల రీత్యానే పాత ఫ్యూడల్ భూసంబంధాలను సంస్కరించి, పెట్టుబడిదారీ సంబంధాలను వ్యవసాయరంగంలో ప్రవేశపెట్టేందుకు పూనుకున్నది. జమీందారీ, జాగీర్దారీ విధానం రద్దు, భూసంస్కరణల, కౌలుదారీ చట్టాలు తెచ్చింది. దీనివలన భూస్వాములు తమ భూములను తామే స్వంతంగా సాగుచేసుకునేటట్లుగా నెట్టబడ్డారు. తాము అజమాయిషీ చేస్తూ వ్యవసాయ కార్మికులను పనిలో పెట్టుకొని ఆధునిక పద్ధతుల్లో వ్యవసాయం సాగించేందుకు పూనుకున్నారు. అలా చేయలేని వాళ్ళు భూములను అమ్మేసుకున్నారు. లేదా బినామీ మార్పిడులు సాగించారు. ఈ పరిస్థితులలో రాష్ట్రానికి రాష్ట్రానికి, ప్రాంతానికి, ప్రాంతానికి తేడాలున్నప్పటికీ ఆ మేరకు మొత్తం మీద భూసంబంధాలలో వచ్చిన మార్పుల ప్రభావం దేశ ఆర్థిక వ్యవస్థపై వున్నది. అంటే దీని అర్థం భూసమస్య పరిష్కారమైందని కాదు. పైగా భూకేంద్రీకరణలో పెద్దగా మార్పు కూడా రాలేదు. అయితే ఫ్యూడల్ వ్యవస్థలో వున్నట్లుగా భూసమస్య యొక్క రూపం నేడు లేదు. ఈ విషయంపై వున్న రెండు పెడధోరణులు (1) భూసమస్య పరిష్కారమైంది ఇక దానిపై పోరాడనవసరం లేదు. (2) భూ సంబంధాలలో ఏ మాత్రం మార్పు లేదు. ఇంకా ఫ్యూడల్ వ్యవస్థే కొనసాగుతున్నది. ఈ రెండు తప్పుడు ధోరణులకు వ్యతిరేకంగా ఒక సరైన అవగాహనను వారణాసి మహాసభ ఇచ్చింది.

(2) పెట్టుబడిదారీ భూ సంబంధాలతో పాటు కొత్త సమస్యలు కూడా ముందుకొస్తున్నాయి. అవి గిట్టుబాటు ధరల సమస్య, ప్రాజెక్టుల సమస్య, కొత్త వంగడాల సమస్య వంటి వాటిపై రైతాంగం కదులుతున్నది. ఇలాంటి సందర్భాలలో ఈ సమస్యలపై రైతాంగాన్ని కదిలించేందుకు కృషి చేయాలన్నది వారణాసి మహాసభ పిలుపు.

(3) మారిన నూతన పరిస్థితులలో వ్యవసాయ కార్మికుల, పేద రైతుల ఐక్యత పునాదిగా రైతాంగ ఉద్యమాన్ని నిర్మించాలి. మధ్యతరగతి ధనిక రైతాంగంపై ఉద్యమం ఆధారపడితే, అది ఊగిసలాటలకు గురౌతుంది. కాని అదే సమయంలో పేద రైతులు పునాదిగా మధ్యతరగతి, ధనిక రైతులతో సహా మొత్తం రైతాంగ ఐక్యతకు పూనుకోవాలి.

పై అవగాహనకు కిసాన్‌సభ రావడంలో కామ్రేడ్ మాకినేని గారి పాత్ర ప్రత్యేకంగా చెప్పుకోదగింది. ప్రస్తుతం మన రైతు ఉద్యమం ఈ అవగాహన కనుగుణంగానే నడుస్తున్నది.

మార్కెట్‌తో వ్యవసాయానికి పెరిగిన అనుసంధానంతో గిట్టుబాటు ధరల సమస్య ముందుకొచ్చింది. ఇది బూర్జువా, భూస్వామ్య వర్గాల మధ్య వైరుధ్యాన్ని పెంచింది. గిట్టుబాటుధరలనేవి ధనిక రైతుల ప్రయోజనాలు కాపాడేవేనని కొందరు అర్థశాస్త్రవేత్తలు వాదిస్తుండగా, దాన్ని పూర్వపక్షం చేసి ఎత్తుగడల రీత్యా ఈ సమస్యను మనం కూడా తీసుకోవాలని, అంతేగాకుండా పేద, మధ్యతరగతి రైతాంగం కు[illegible] సుడిగుండంలోకి ఈడ్చబడిందని, అందువలన వా[illegible] కొంతమేరకు ప్రయోజనం చేకూరుతుందని [illegible] ఒప్పించగలిగారు. ఈ సమస్యపై కొన్ని వ్యాసాలు వ్రాశారు.

భారతదేశ రైతాంగ విముక్తికి వ్యవసాయక విప్ల[illegible] శరణ్యమని, అది కార్మిక-కర్షక మైత్రి ద్వారానే సాధ్యమని [illegible] విశాల దృక్పథంతో ఆయన ఎల్లప్పుడూ భారతదేశ భవిష్యత్‌ను గురించి విశ్వసిస్తూ వుండేవారు. ఎన్ని ఆటుపోట్లు వచ్చినా నిబ్బరంగా వుంటూ తన చుట్టూ వుండే పార్టీకి, ప్రజానీకంలో కూడా ఆత్మవిశ్వాసాన్ని పెంచడంలో కూడా ఆయన ఉపన్యాసాలు, వ్యాసాలు ఉపకరించాయి. పార్టీపై సైద్ధాంతికంగా, భౌతికంగా శత్రువు దాడిచేసిన సందర్భాలలో కామ్రేడ్ ఎం.బి. ప్రజల మధ్య ఉండి శత్రువు చర్యలను చీల్చి చెండాడేవారు. అవి మనకెంతో అండను చేకూర్చేవి.

ఢిల్లీలో వున్నప్పటికీ మన రాష్ట్ర రైతు, వ్యవసాయ కార్మిక సంఘాల కార్యకలాపాలను ఆయన శ్రద్ధతో పరిశీలిస్తుండేవారు. ఖమ్మం రైతు మహాసభకు, తెనాలి వ్యవసాయ కార్మికసంఘం మహాసభకు హాజరై సందేశమివ్వడమే గాక పలు సూచనలు కూడా చేశారు. ఆయన స్మృతి మనలను వెన్నంటి వుంటుంది. ఆయన ఆశయసాధనకై ఆంధ్రప్రదేశ్ రైతుసంఘం నిర్విరామ కృషి సాగిస్తుంది.

# ఆంధ్రప్రదేశ్‌లో వ్యవసాయక పరిస్థితులు

## ఆంధ్రప్రదేశ్ రైతు సంఘం 14వ మహాసభ విశ్లేషణ

గత దశాబ్ద కాలంలో రాష్ట్రంలో వ్యవసాయ రంగంలో ఎన్నో మార్పులు ప్రవేశపెట్టబడ్డాయి. ట్రాక్టర్లు, మోటార్లు, కొత్త వంగడాలు, ఎరువులు, పురుగుమందుల వాడకం బాగా పెరిగింది. దాని ఫలితంగా పెట్టుబడి ఖర్చులు పెరిగాయి. ముఖ్యంగా వ్యాపార పంటల విషయంలో చిన్న రైతులు ఈ పోటీకి తట్టుకోలేక తమ పొలాలను కౌళ్ళకిచ్చుకోవడమో లేక అమ్ముకొనడమో జరుగుచున్నది. పంటలు పండించే రైతులకు కూడా ఒకటి రెండు సంవత్సరాలు బాగా మిగులు వుంటే ఆ తర్వాత వరుసగా 3, 4 సం॥లు నష్టాలు రావడం సర్వసాధారణమైంది. దీనితో వ్యాపార పంటలు పండించే రైతాంగం చితికిపోతున్నది. రుణ భారం పెరిగి తీర్చలేక భూములమ్ము కొనవలసి వస్తున్నది.

మరొక వైపు మాగాణి ప్రాంతంలో భూస్వాములు తమ భూములు స్వంతంగా సాగు చేసుకోక పేద రైతులకు, వ్యవసాయ కార్మికులకు కౌళ్ళకిస్తున్నారు. సాధారణంగా కౌలు సగటున 25 నుండి 30 బస్తాల వరకు వుంటున్నది.

అలాగే కోస్తా ప్రాంతంలో చేపలు, రొయ్యల పెంపకం బాగా విస్తరిస్తున్నది. వేలాది ఎకరాలు కొనుక్కొని లేదా లీజుకి తీసుకొని ధనిక రైతులు రొయ్యలు పెంచుతున్నారు. బడా పెట్టుబడి దారులు కూడా ఈ రంగంలో ప్రవేశిస్తున్నారు. ఇది ప్రధానంగా ఎగుమతులపై ఆధారపడిన పరిశ్రమ. దీనితో అంతకు ముందు వరకు పనికిరాని భూముల ఖరీదు కూడా విపరీతంగా పెరిగింది. వ్యవసాయ కూలీలకు పని దినాలు తగ్గి నిరుద్యోగం ప్రబలుతున్నది.

**పంటల ఉత్పత్తి:** గత మూడు సంవత్సరాల కాలంలో పంటల ఉత్పత్తిలో పెరుగుదల లేదు. పైగా ఈ సం॥ ఖరీఫ్‌లో ఆహార ధాన్యాల, నూనె గింజల ఉత్పత్తి తగ్గింది.

| | 1990-91 (లక్షల టన్నులు) | 91-92 |
|---|---|---|
| ఆహారధాన్యాల ఉత్పత్తి (ఖరీఫ్‌లో) | 85.94 | 83.34 |
| నూనెగింజల ఉత్పత్తి | 17.6 | 15.13 |
| చెరకు | 12.68(12.16) | -- |
| పత్తి (లక్షల బేళ్ళు) | 11.10 (9.31) | -- |

(బ్రాకెట్లలోనివి అంతకు ముందు సం॥ అంకెలు)

ఈ సంవత్సరం ప్రపంచ బ్యాంకు పనుల కారణంగా కృష్ణా, గోదావరి డెల్టా కింద రబీ విస్తీర్ణం తగ్గింది. దీనితో పాటు వరదలు, టుంగ్రోవైరస్ సోకడం కూడా దిగుబడి తగ్గడానికి ముఖ్య కారణాలే.

**నీటి వనరులు:** రాష్ట్రంలో సాగుభూమిలో 33 శాతం విస్తీర్ణానికి మాత్రమే నీటి వనరులున్నాయి. ఇందులో కాలువల ద్వారా సాగయ్యే భూమి 43.4 శాతం కాగా మైనర్ ఇరిగేషన్ (చెరువులు, బావులు వగైరా) ద్వారా 56.6 శాతం భూమి సాగు అవుతున్నది. 1988-89 నుండి 90-91 వరకు గల 3 సంవత్సరాల కాలంలో కాలువల ద్వారా అదనపు సాగు విస్తీర్ణం ఒక్క ఎకరా కూడా పెరగలేదు. ప్రతి సం॥ బడ్జెట్‌లో వందల కోట్ల రూపాయలు కేటాయిస్తున్నట్లు కనపడుతున్నా ప్రభుత్వానికి ఒక నిర్దిష్ట ప్రణాళిక లేనందున అదనపు సాగుబడి రావడం లేదు. ప్రాజెక్టుల నిర్మాణపు ఖర్చు మాత్రం పెరుగుచున్నది.

| సంవత్సరం | మొత్తం నికర నీటి సాగుభూమి విస్తీర్ణం (లక్షల ఎకరాలు) | మైనర్‌ఇరిగేషన్ ద్వారా సాగయ్యే భూమి విస్తీర్ణం (లక్షల ఎకరాలు) |
|---|---|---|
| 1988-89 | 106.4 | 59 67 |
| 89-90 | 107.13 | 60.4 |
| 90-91 | 107.65 | 60.93 |

ఈ మూడేండ్లలో అదనంగా నీటి వనరులు రైతులే స్వయంగా బావులు, బోర్లు వేయించుకొని కల్పించుకున్నారు. అప్పులు తెచ్చుకొని బావులు తవ్వుకున్నా ప్రభుత్వం విద్యుత్ సరఫరా ఇవ్వనందున నేటికి 3 లక్షల దరఖాస్తులు పెండింగులో వున్నాయి. ఇందులో షెడ్యూల్డు కులాలు, జాతులకు సంబంధించినవి గణనీయంగా వున్నాయి. కొన్నిచోట్ల రైతులే స్వంతంగా వాగులపై లిఫ్టుఇరిగేషన్ పెట్టుకొని సాగు చేసుకుంటున్నారు చెరువులు కుంటల కింద సాగ స్వాతంత్ర్యానంతరం ఏ మాత్రం పెరుగుదల లేదు. అప్పుడు ఇప్పుడూ కూడా 20 లక్షల ఎకరాలకు మించి సాగవ్వడం లేదు ఇందుకు ప్రధాన బాధ్యత ప్రభుత్వానిదే. ఏళ్ళ తరబడి మరమ్మతుల లేక చెరువులు తెగిపోయి నీరు నిలవక ఎండిపోతున్నాయి కలుజులు బాగు చేసినట్లు రికార్డుల్లో చూపుతున్నారు తప ఆచరణలో లేదు. కాని నీరివ్వకపోయినా నీటి తీరువా మాత్ర గోఖ్ఖాడ గొట్టి వసూలు చేయాలని ప్రయత్నిస్తున్నార మొత్తం మీద మైనర్ ఇరిగేషన్ పట్ల రాష్ట్ర ప్రభుత్వ నిర్లక్ష్య వైఖ కొనసాగుతూనే వున్నది.

అలాగే మేజర్, మీడియం ప్రాజెక్టుల నిర్మాణం నత్తనడ సాగుతున్నది. నాగార్జున సాగర్ కుడి, ఎడమ కాలువలకు ఏ సంవత్సరం 3, 4 సార్లు గండ్లుపడి లక్షలాది ఎకరాల పం దెబ్బతిన్నది. అధికారుల నిర్లక్ష్యమే దీనికి కారణం. నిత్య కరువుకు గురవుతున్న రాయలసీమ, తెలంగాణా జిల్లాలక ప్రకాశం, నెల్లూరు జిల్లాలోని కరువు ప్రాంతాలకు నీటి వనరు కల్పించే తెలుగు గంగ, హంద్రీనీవా, గాలేరు-నగరి, వెలుగొం పథకం, సీతారాంపురం రిజర్వాయరు పోచంపాడు ఎత్తిపో పథకం, శ్రీశైలం ఎడమగట్టు కాలువ, శ్రీరాంసాగర్ 2వ

పులిచింతల, పోలవరం వంశధార 2వ దశల నిర్మాణానికి అవసరమైన కేంద్ర ప్రభుత్వ అనుమతి ఇంతవరకు లభించలేదు. ఇప్పటికే ప్రారంభించబడి నిర్మాణంలో వున్న ప్రాజెక్టుల పని నత్తనడక నడుస్తున్నది. తుంగభద్ర హైలెవల్, శ్రీశైలం కుడి బ్రాంచి కాలువ, సుంకేశుల, అలగనూరు బ్యాలెన్సింగ్ రిజర్వాయర్లు, జూరాల, శ్రీరాంసాగర్ మొదటి దశలను పూర్తి చేయడానికి సరైన నిధుల కేటాయింపు జరగలేదు. పనిలో జాప్యం వలన వ్యయం భారీగా పెరుగుచున్నది. పైగా కేటాయిస్తున్న నిధులు కూడా పూర్తిగా ఖర్చు పెట్టడం లేదు. ఉదాహరణకు 7వ పంచవర్ష ప్రణాళికా కాలంలో విద్యుత్, నీటి పారుదల కోసం రు. 3600 కోట్లు కేటాయించగా ఇందులో రు. 1263 కోట్లు ఖర్చు కాలేదు. 91-92 బడ్జెట్‌లో మేజర్ ఇరిగేషన్‌కు రు. 396 కోట్లు కేటాయించగా 385 కోట్లు మాత్రమే ఖర్చు చేశారు. మైనర్ ఇరిగేషన్‌కు రు. 75 కోట్లు కేటాయించినా 48 కోట్లు మాత్రమే ఖర్చు అయి వుంటుందని అంచనా. శ్రీశైలం కుడి కాలువకు శ్రీరాంసాగర్ మొదటి దశకు ప్రపంచ బ్యాంకు నిధులు కేటాయించినప్పటికీ సకాలంలో ఖర్చు పెట్టి పని పూర్తి చేయగలిగిన స్థితిలో రాష్ట్ర ప్రభుత్వం లేదు. బచావత్ కమీషన్ ప్రకారం కృష్ణాలోని మిగులు జలాలను 2 వేల సంవత్సరం వరకు వాడుకునే హక్కు మన రాష్ట్రానికున్నది. ఈలోగా ప్రాజెక్టుల పని పూర్తయితే లక్షలాది ఎకరాలను అదనంగా సాగులోకి తేవచ్చు. కాని ప్రస్తుత రాష్ట్ర ప్రభుత్వ వైఖరి అందుకనుగుణంగా లేదు. రాష్ట్రంలో నీటి సమస్య పరిష్కారానికి దక్షిణాది నదుల అనుసంధానాన్ని గురించి కొందరు సూచించారు. ఇది మన రాష్ట్ర ప్రయోజనాలకు ఏమాత్రం అనుగుణమైంది కాదు. కాబట్టి ఈ ప్రతిపాదనను మనం వ్యతిరేకించాలి.



డెల్టా ప్రాంతంలో ప్రతి సంవత్సరం వరదలు, తుపానులతో పెద్ద ఎత్తున పంట, ఆస్తి నష్టం జరుగుచున్నది. దీన్ని నివారించేందుకు రాష్ట్ర ప్రభుత్వం మొన్నటి వరకు ఎలాంటి చర్యలూ చేపట్టలేదు. రైతాంగంలో ఆందోళన పెరిగే కొద్దీ రైతు సంఘాల కృషి తోటి ప్రపంచ బ్యాంకు నిధులతో ప్రస్తుతం డ్రైనేజి కాలువల మరమ్మత్తులు సాగుతున్నవి. కాని ఇవి అనుకున్న ప్రకారం సకాలంలో పనులు సాగడం లేదు. రైతులు రబీ పంట వదులుకున్నా పని చురుగ్గా సాగనందున రైతుల్లో అసంతృప్తి వున్నది. పని జరుగుతున్న తీరులలో అనేక లోపాలు, అవకతవకలు జరుగుతున్నాయి. ప్రస్తుత మేజర్ డ్రైన్‌ల పని మాత్రమే చేపట్టారు. మైనర్ డ్రైన్‌ల పని రాష్ట్ర ప్రభుత్వం ...యించవలసి వున్నది. కాని ఆ పనులు చేయడం లేదు. అందువలన వందల కోట్లు ఖర్చు పెట్టి డ్రైన్‌ల మరమ్మత్తులు ...గుతున్నా పై ...ర్ డ్రైన్‌లు బాగు చేయకుండా దీని ప్రయోజనం ...ంగలేను తిరిగి కథ మొదటికే వస్తుంది. ప్రకృతి వైపరీత్యాల కారణంగా దెబ్బతినే రైతాంగాన్ని ఆదుకునేందుకు సమగ్రమైన పంటల భీమా పథకం ఆచరణలో లేదు.

వ్యవసాయ రంగంలోనూ, నీటిపారుదల, విద్యుత్, రెవెన్యూ వంటి రంగాలలో అవినీతి విశృంఖలంగా వ్యాపించింది. నేడు రైతులకు ఏ పని కావాలన్నా లంచం లేనిదే సాగడం లేదు. ప్రాజెక్టులు, కాలువల నిర్మాణంలో అధికారంలో వున్న రాజకీయ నాయకులు, కాంట్రాక్టర్లు, అధికారులు వాటాలు పంచుకొని అసలు పని నామమాత్రంగా చేయడం వలన వర్షాలు వచ్చిన ప్రతిసారీ అవి తెగిపోవడమో, దెబ్బ తినడమో చూస్తున్నాం. తెలుగు గంగ టెండర్ల విషయంలోనూ, ప్రపంచ బ్యాంకు పనుల టెండర్ల విషయంలోనూ జరిగిన గోల్‌మాల్స్ అన్నీ పత్రికల్లో వచ్చాయి. ఒక రకంగా చెప్పాలంటే నీటి పారుదల శాఖ అవినీతిమయమై పోయింది. అలాగే విద్యుత్ కనెక్షన్ల కోసం, పట్టా సర్టిఫికెట్ల కోసం, రుణాల మంజూరు కోసం లంచమో, అధికార పలుకుబడో వుంటే తప్ప పని జరగడం లేదు. ఇది సామాన్య రైతాంగాన్ని క్రుంగదీస్తున్నది.

వ్యవసాయక రంగంలో భూమిలేకపోవడం, ఉన్నా భూమిపై హక్కు లేకపోవడం, ఉత్పత్తి ఖర్చులు తీవ్రంగా పెరగడం, అతివృష్టి, అనావృష్టి, చీడపీడలు వంటి వైపరీత్యాలు నేడు రైతాంగాన్ని తీవ్రంగా దెబ్బ తీస్తున్నాయి. దీని ఫలితంగా పేద రైతాంగం నిష్ట దారిద్ర్యానికి గురవుతున్నది. మధ్య తరగతి రైతులనేకమంది రుణగ్రస్తులవుతున్నారు. వ్యవసాయరంగంలోని మిగులు ఫలసాయం భూస్వాముల, వ్యాపారస్తుల చేతుల్లో కేంద్రీకృతమౌతున్నది. దీని ఫలితంగా పేద ధనిక తారతమ్యాలు తీవ్రంగా పెరుగుతున్నాయి. అభివృద్ధి చెందిన - చెందని ప్రాంతాల మధ్య అఘాతం పెరుగుచున్నది. 1991 జనాభా లెక్కల్ని పరిశీలిస్తే ఇది మరింత స్పష్టంగా కన్పిస్తుంది.

1991 జనాభా లెక్కల ప్రకారం మన రాష్ట్ర జనాభా 6 కోట్ల 63 లక్షలు. ఇందులో పని చేయగలిగిన శ్రామిక జనాభా 2 కోట్ల 84 లక్షలు (45.3 శాతం) ఇందులో 80 శాతం రైతులు, వ్యవసాయ కార్మికులే. సాగుదార్ల సంఖ్య 78 లక్షలు. మొత్తం శ్రామిక జనాభాలో ఇది 27.76 శాతం మాత్రమే. 1981 జనాభా లెక్కల ప్రకారం వీరు 32.74 శాతంగా వున్నారు. అంటే 5 శాతం తగ్గింది. అదే మరొక వైపున వ్యవసాయ కార్మికుల సంఖ్య 1 కోటి 15 లక్షల 75 వేలకు పెరిగింది. ఇది శ్రామిక జనాభాలో 40.76 శాతం. 1981 లెక్కల ప్రకారం వీరు 36.79 శాతం మాత్రమే. అంటే 4 శాతం పెరిగింది. గత దశాబ్ద కాలంలో వ్యవసాయ సాగుదార్ల సంఖ్య తగ్గిపోతున్నది. అంటే వారు

(మిగతా 38వ పేజీలో)

# రాష్ట్రంలో నీటి వనరుల వినియోగ సమస్యలు మన కర్తవ్యం

డాక్టర్ శ్రీరామకృష్ణయ్య
తెలుగుగంగ రిటైర్డ్ చీఫ్ ఇంజినీర్

నీటి వనరుల సమస్య విషయానికి వచ్చినట్లయితే రాష్ట్రంలో 275 లక్షల ఎకరాల సాగుభూమి ఉంది. దానికి సరిపడే నీరు కూడా మన రాష్ట్రంలోనే వుంది. అయితే ఈ నీరు కావలసినంత లేదు. అవసరం లేని దగ్గర అంతకంటే ఎక్కువ వుంది. అందువల్ల మనం చేయవల్సినది ఏమంటే ఆ నీరును ఒకచోట నుండి మరియొక చోటకు, ఒక లెవెల్ తీసుకొని రావడమే. మనం విస్తారంగా వనరులు ఉన్నాయి వాటిని సద్వినియోగపర్చుకోవడమ మనం చేయవలసిన పని. చాలా రాష్ట్రాల్లో వనరులు లేక వాళ్ళ ఇబ్బందుల పాలౌతున్నారు. కాని మనకు ఆ అసౌకర్యం లేదనే చెప్పాలి.

ఒక సగటు వర్షపాతం వలన 8,400 టి.ఎం.సి.ల నీరు మన రాష్ట్రంలో పడుతుంది. ఈ నీరు ఏమైంది. దీని కొరకు వినియోగించాం. చెరవులోకి, బావులలోకి, పంటలకు ఎంత పోయింది. వృక్ష సంపదకు ఎంత పోయింది అనేటటువంటి లెక్కలు మన రాష్ట్రంలో లేవు. ఈ లెక్కలు తీసుకొని ఈ నీటి మొత్తంతో మన భూమిని సస్యశ్యామలం చేయవచ్చు. దురదృష్టవశాత్తు ఈ విధమైన లెక్కలు లేవు ఆలోచన కూడా రాలేదు. ఇది కాకుండా కర్ణాటక, మహారాష్ట్ర, ఒరిస్సా, మధ్యప్రదేశ్ నుండి కూడా మనకు అదనపు నీరు వస్తున్నది. ఇదంతా కలుపుకున్నట్లయితే మనకు కావలసిన దాని కంటే ఎక్కువ ప్రమాణంలోనే నీరు ఉందని చెప్పడానికి సాహిస్తున్నాను.



సెమినార్‌లో డాక్టర్ శ్రీరామకృష్ణయ్య

సుమారుగా 90 లక్షల ఎకరాలకు ప్రాజెక్టుల ద్వారా నీరు లభిస్తున్నది. ఈ 90 లక్షల ఎకరాల్లో అస్తవ్యస్థ పరిస్థితి ఏర్పడింది. సుమారుగా 25 లక్షల ఎకరాలకు సక్రమంగా ప్రతి సంవత్సరం నీరు ఉండదు. ఈ భూమి చెరువల క్రింద కరువు ప్రాంతాల క్రింద వుంటున్నది. దీనిలో పట నమ్మకమైనదిగాను, నికరమైనది గాను కాదు. 10 లక్షల ఎకరాలకు, కాలువ చివరి భూములకు అన్ని ప్రాజెక్టులు కలిపి సక్రమంగా నీరు అందివ్వలేని స్థితిలో వున్నాం. 4.5 లక్షల ఎకరాలలో మురుగు నీటి సౌకర్యం లేక ప్రతి ఏడాది పంట చెడిపోతున్నది. మనకు నీటి సౌకర్యం ఉన్నది 90 లక్షల ఎకరాలు అయితే అందులో సగం మనకు స్వాతంత్ర్యం రాకపూర్వమే నీటి సౌకర్యం కల్పించబడింది. తరువాత రెట్టింపు చేయగలగినప్పటికి, అందులో సగం భూమికి సకాలంలో సక్రమంగా నీరు ఇవ్వలేకపోతున్నాం. ఈ స్థితిని చక్కదిద్దినా మన దేశంలో ముఖ్యంగా మన రాష్ట్రంలో ఆహార పంటల విషయంలో చాలా వెనుక బడి వున్నాం.

ఈ నీటి వనరులు కల్పించడమనేది ముఖ్యంగా కోస్తా, రాయలసీమ ప్రాంతమైనటువంటి తూర్పు చాళుక్యుల రాజ్యంలోనూ, తెలంగాణాలో పరిపాలించిన విజయనగర రాజుల కాలంలోనూ, కాకతీయ ప్రభువుల కాలంలోనూ చాలా చెరువులు నిర్మించారు. అందులో కొన్ని ప్రస్తుతం వున్నటువంటి ఇంజనీరింగ్ పరిజ్ఞానం కంటే మించి పరిజ్ఞానం వుంది. అంత సాహసోపేతంగా అటువంటి చెరువులు నిర్మించారు. అటువంటి వాటిని ఈనాడు మనం నిర్వహించుకోలేక దుర్వినియోగవరుస్తున్నాం. మన రాష్ట్రంలో సంవత్సరానికి సుమారుగా మూడు వేల చెరువులు తెగిపోతుంటాయి. దీనికి కారణం ఎవరూ ఆలోచించరు. బాధ్యత వట్టించుకోరు. ఒకప్పుడు రైతునకు ఆ బాధ్యత ఉండేది తరువాత ప్రభుత్వం శిస్తు వసూలు చేయటం ప్రారంభించిన తరువాత ప్రభుత్వ బాధ్యత అయింది. కాని ప్రభుత్వం తన బాధ్యతను మరచిపోయిందనే చెప్తున్నాను. ఎలా అంటే దానికి అవసరమైన నిదులు మంజూరు చేయకపోవడం, అవసరమైన ఆర్గనైజేషన్ సెటప్‌లేకపోవడం వల్ల ఈ చెరువులు మరమ్మత్తులు లేక పూడిక పోయి వర్షం పడగానే తెగిపోతున్నవి

బ్రిటిష్ పరిపాలనా కాలంలో ప్రజలు పోరాటాలు చేయకుండానే, అడుగకుండానేకరువు ప్రాంతాల్లో మానవతా దృక్పధంతో వాళ్ళకు రెవిన్యూ పెరగడం కోసం గొప్ప ప్రాజెక్టులు చేపట్టారు. 1833 ఉభయ గోదావరి, కృష్ణ, గుంటూరు, ఈ జిల్లాల్లో నూటికి 40 మంది చనిపోవడం దాని ఫలితంగా గోదావరి డెల్టా కృష్ణ డెల్టా వచ్చాయి. అలాగే రాయలసీమలో కరువు కాటకాలను నివారించడం కోసం కర్నూల్-కడప కాలువ తుంగభద్ర కాలువ చేపట్టడం జరిగింది. ఇవన్నీ ఫెమెయిన్ కమీషన్ రిపోర్ట్ వలన వచ్చినవే తప్ప ప్రజా పోరాటాల వలన రాలేదు.

మనకు స్వతంత్ర్యం వచ్చిన తర్వాత మనం ఆశించిం

ఏమంటే వనరులు ఎక్కడ వున్నాయి. ఎంత ఉన్నాయి. ఎంత భూమికి నీటి వసతి కల్పించగలం అనే ప్రణాళిక చేసి ఒక క్రమ పద్ధతిలో అమలు చేస్తారని ఆశించాం. కాని ఆ విధంగా ఇంత వరకు జరగలేదు. కొన్ని ప్రత్యేక కారణాల వలన నాగార్జునసాగర్, శ్రీశైలం ప్రాజెక్టు, శ్రీరాంసాగర్ ప్రాజెక్టుల నిర్మాణం జరిగింది. కృష్ణ-పెన్నార్ పథకం పేరు చెప్పి నీరు మద్రాస్‌కు తరలించుకుపోయి చెంగల్‌పట్ జిల్లాకు నీరు తరలిస్తున్నారని ఉద్యమం లేవదీయడం, ఆ కారణం వలన నాగార్జునసాగర్ వచ్చింది. అలాగే గోదావరి నదిపై ఒక్క ప్రాజెక్టు కూడా కట్టలేదని తెలంగాణాలో ఆందోళన చేసినందు వలన శ్రీరాంసాగర్ (పోచంపాడు) వచ్చింది.

అంతేతప్ప ప్రభుత్వపరంగా, ప్రణాళికా బద్ధంగా ఆలోచన చేసి, ఈ నీటి వనరులను ఈ ప్రాంతాలకు ఉపయోగించాలని వారంతట వారుగా ప్రణాళికా దృష్టితో చేయలేదు. చిన్న కుంట నిర్మించాలన్నా చెరువు నిర్మాణం జరగాలన్నా, కాల్వ మరమ్మతుకుగానీ, ప్రజా నాయకులు ఎంతో ప్రయాసపడితే తప్ప, దానికి మోక్షంలేదు. మన రాష్ట్రంలో 40,000 చెరువులున్నాయి. వాటిని 10 సం॥ ప్రణాళికను సిద్ధం చేసి ఏటా 4000 చెరువులను రిపేరు చేద్దాం అనే ఆలోచన లేదు. ఏదో చేస్తున్నాం అని అక్కడక్కడ నామమాత్రంగా పనులు జరిపిస్తున్నారు తప్ప చిత్తశుద్ధితో చేయడం లేదు.

ఇంకా మనం సాధించుకోవాల్సిన ప్రాజెక్టులు చాలా ఉన్నాయి. ఈ ప్రాజెక్టులు సాధించుకునేందుకు రాజకీయం చేస్తున్నారు. ఒక ప్రాజెక్టును ఒక వర్గం వారు కావాలంటే ఒక వర్గం వారు వద్దు అని అడ్డు తగలడం జరుగుతున్నది. ప్రత్యేకమైన డబ్బు ఉంటే సమస్యేలేదు. ఎవరైనా ఉత్సాహవంతులు రాజకీయ పార్టీ నాయకులు కృషి చేసినట్లయితే దానికి వనరులు సమకూరుతున్నాయి. ఇటువంటి కాలయాపన చేసి, ప్రజలలో అనైక్యత, సృష్టించి ఏ ప్రాజెక్టు సాధించుకోలేని స్థితిలో వున్నాం.

నీటి వనరుల కంటే వరి పండించడం అనేది ఆచారమైపోయింది. ఇది 1928 వరకు కొనసాగింది. 1928 తర్వాత వరే ఎందుకు పండించాలి అరుదళ్ళ పంటలు ఎందుకు పండించకూడదు అనే భావాన్ని అమలు చేయాలని చెప్పి ఆంధ్ర రాష్ట్రంలో మద్రాస్ ప్రభుత్వం వుండగా నిర్ణయం జరిగింది. కాని తమిళనాడు బియ్యం తక్కువ అవుతాయి. అవి ఆంధ్ర నుండి రావాలి అనే ఉద్దేశ్యంతో రాయలసీమలోను, కరువు ప్రాంతాలైన తుంగభద్ర ప్రాజెక్టును కూడా 3వ వంతు వరిఅ నేది నిర్ణయించటం జరిగింది. ఆరు తడి పంటలు వేస్తే తప్ప ఆగ్రో ఇండస్ట్రీ డెవలప్‌మెంట్ కావటానికి అవకాశం వుండదు. కేవలం వరి పండించనంత కాలం ఈ రాష్ట్రం బాగుపడదు.

ఈ రోజున నీటి వనరుల ఉపయోగంలో కూడా ఏ పంట పండిస్తే మనకు మనకు లాభదాయకం, ఎంత ఎంప్లాయ్‌మెంట్ వస్తుంది, ఎలా ముందుకు పోతాం అనేది ముఖ్య విషయం. సుమారుగా 1000 సం॥ నుండి నీటి యాజమాన్యం రైతు చేస్తున్నారు. అయితే కొన్ని ఆనవాయితీలు ఏర్పరచుకొని న్నారు. కృష్ణ, గోదావరి డెల్టాలో సుమారుగా 90 లక్షల ఎకరాలలో 60 లక్షల ఎకరాలలో రైతులేనీటి యాజమాన్యం చేస్తున్నారు. చెరువుల క్రింద, ఊట కాలువల క్రింద కూడా చేస్తున్నారు. ఇదీ కాకుండా పొంచి ఇరిగేషన్ అనేది కొన్ని చోట్ల వుంది. ఇది Collective forming Knowledge. గ్రామస్థులు అందరూ కలసి నీరు తీసుకొని వచ్చి, సేద్యం చేస్తారు. భూమి దామాషా పద్ధతిపై అందరూ ఫలితం పంచుకుంటారు. అటువంటి పరిస్థితులలో కొత్తగా వచ్చిన నాగార్జున సాగర్, శ్రీరాంసాగర్ వంటి ప్రాజెక్టులలో, ప్రభుత్వం వారు మేం నీటి యాజమాన్యం చేస్తాం అని కలుగజేసుకున్నారు. రైతుల సహకారం లేకుండా, రైతుల జోక్యం లేకుండా నీటి యాజమాన్యం జరగదు.

మనరాష్ట్రం ఒకే సంవత్సరం అతివృష్టికి,అనావృష్టికి లోను కావడం సహజం అయింది. తుపాన్ వస్తే నివారణకు శాశ్వత చర్యలు చేపట్టాలనే ఆలోచన లేదు. ఎంతసేపు అరకొర సహాయంకై కేంద్ర ప్రభుత్వంపై దేవురించడం జరుగుతున్నది. ఇదీ జరుగుతున్న పరిస్థితి.

నీటి పారుదలాసౌకర్యంఉన్న భూములలో పెస్టిసైడ్స్ వాడకం ఎక్కువగా ఉంది. కొన్ని పద్ధతులు అనుసరించడం వలన పర్యావరణ దెబ్బతింటున్నది. చాలా భూములలో Salinity, Waer Blocking వంట తగ్గిపోవడం జరుగుతున్నది. మనకు మేలు చేఉసే సూక్ష్మ జీవులు నశించిపోతున్నవి. ఇక భూగర్భ జలాల విషయానికి వస్తే మెట్ట ప్రాంతాల్లో కరువు ప్రాంతాల్లో Tube wells, Dores వచ్చిన తర్వాత గతంలో 50 అడుగులలో ఉన్న నీరు ఇపుడు 200-300 అడుగులు వరకు పోయింది. సబ్ మెర్సిపుల్ పంప్ సెట్‌లు పెట్టి రైతులు చాలా నష్టపోతున్నారు. భూగర్భ జలాలు అనిశ్చత మైనవి. ప్రతి సంవత్సరం వస్తాయని గ్యారంటీ లేదు. ఎన్నో శతాబ్దాల నాటి వారు వాడుకుంటున్నారు. తోడుకున్న కొలది అవి వాడలకు పోతాయి. అందువల్ల రైతులు ఈ నీటి యాజమాన్యం విషయంలో జాగ్రత్త వహించాలి.

దక్షిణాది రాష్ట్రాల నదులు అనుసందానం వలన మన రాష్ట్రం నష్టపడి తమిళనాడు, కర్నాటక, మహారాష్ట్రలు మేలు పొందుతాయి. ఇది అమలు జరిగినట్లయితే నల్గొండ, మహబూబ్‌నగర్, రాయలసీమకు తీరని అన్యాయం జరుగుతుంది. ఒక రాజకీయ నాయకుడు ఇటీవల విశాఖ నగరం నుండి దక్షిణాధి జలాల అనుసంధానం కోరుతూ యాత్ర జరుపుతున్నారు. ఇందుకై రాజకీయ నాయకులు ఇంజనీర్లతో కేంద్రస్థాయిలో సమావేశాలు జరుపుతున్నారు. అందరం కలిసి, రాష్ట్ర జలవనరులను కాపాడుకోవాల్సిన అవసరముంది ఈ పథకానికి వ్యతిరేకంగా ప్రజలు, మేధావులు, రైతులు, రాజకీయాలతో నిమిత్తం లేకుండా కలిసి పోరాడాలని ఆయన పిలుపునిచ్చారు.

ఇప్పటికే కృష్ణానది జలాలపై కర్నాటక ప్రభుత్వం అనేక డ్యాంలు నిర్మిస్తున్నదు,ఇ 2000 సంవత్సరానికి మనకు తీరని నష్టం జరుగుతుంది. గతంలో 1950లో కృష్ణ-పెన్నా ప్రాజెక్టు తల పెట్టినపుడు ఆంధ్ర రాష్ట్రమంతా యుక్తకంఠంతో వ్యతిరేకించింది. అంతేకాదు కేంద్ర రాష్ట్ర ప్రభుత్వం విధానాలు ప్రాంతాల వారిగా ప్రజల మధ్య చిచ్చురగొల్డే విధంగా వున్నాయి. రాష్ట్రానికి చెందిన పలు ప్రాజక్టుల విషయంలో కేంద్రం కాలయాపన చేస్తున్నది. నీటిని రాజకీయం చేయకుండా, రాబోయే తరంకైనా మనమంతా భారీ ప్రాజెక్టులను సాధించగలమని ఆశిస్తారు.

# వ్యవసాయ సాంకేతిక పరిజ్ఞానం దాని సాధకబాదకాలు

డాక్టర్ ఐ.వి. సుబ్బారావు

మనదేశం ప్రధానంగా వ్యవసాయక దేశం. మన రాష్ట్రాన్ని తీసుకొన్నట్లయితే వ్యవసాయమే ప్రధానమైందిగా ఉంది. వ్యవసాయ రంగాన్ని అభివృద్ధి చేయడంలో ప్రభుత్వం పై చాలా బాధ్యత ఉంది. ప్రతివాడికి తిండి, బట్ట కల్పించడం ప్రభుత్వ బాధ్యత. అలా కల్పించినపుడే ఆకలిచావులు లేకుండా దేశం పటిష్టంగా, సుభిక్షంగా మనుగడసాగిస్తుంది. స్వాతంత్ర్యానికి పూర్వం మనదేశ ఆహారధాన్యాల ఉత్పత్తి 50-57 మిలియన్ టన్నులు ఉండేది. ఆ పరిస్థితులలో రష్యా వంటి ఇతర దేశాల నుండి ఆహారధాన్యాలను దిగుమతి చేసుకునేవాళ్ళం. దీనినే ఇంకో విధంగా చెప్పాలంటే ఇతర దేశాల నుండి అడుక్కుతినే స్థితి అన్నమాట.

అయితే ఈ స్థితిలో వ్యవసాయక విప్లవం వచ్చింది. ఇది రైతులవల్లగాని, ప్రభుత్వం వలనగాని, రాజకీయ పార్టీల నాయకుల వలనగాని ఏదేశంలో లేని విధంగా ఈ విప్లవం సాధించబడింది. అప్పటి వరకు ఇతరదేశాల నుండి దిగుమతి చేసుకుంటున్న మనం దేశంలో కొద్దోగొప్పో తిండి పెట్టగలుగుతున్నాం. ఇతరదేశాలకు కూడా ఎగుమతి చేయగల్గుతున్నాం. మరి ఏ యితర దేశంలోనూ ఈ విధమైనటువంటి విప్లవం రాలేదు. మనదేశంలో రైతులలో ఎక్కువ మంది నిరక్షరాస్యులు అయినప్పటికీ ఉన్న కొద్దిమేర సాంకేతిక పరిజ్ఞానంతో ఈ విప్లవం సాధించబడింది. అయితే ఈ అభివృద్ధి చాలదు. రాబోవు 2000, 2010 సంవత్సరానికి పెరిగే అధిక జనాభాకు సుమారుగా 220-240 మిలియన్ టన్నుల ఆహారధాన్యాలు కావాలి. కాని ఇప్పుడు ఉన్నవి 175 మిలియన్ టన్నులు మాత్రమే. ఈ 47 సంవత్సరాల కాలంలో 47 మిలియన్ టన్నుల నుండి 175 మిలియన్ టన్నులకు పెంచగలిగాం. అయితే రాబోయే 10,12 సంవత్సరాలల్లో ఇంకా 70 మిలియన్ టన్నుల ఆహారధాన్యాలు పండించగలగాలి. ఇది సాధ్యపడుతుందా? ఇప్పటికే వ్యవసాయ రంగం క్లిష్టస్థితిలో వుంది. ఈ సుదీర్ఘ గమ్యం చేరాలంటే ఏ దిశలో పయనించాలి.

మనదేశంలో శాస్త్రజ్ఞులు అనేక రంగాల్లో ఏ దేశానికి తీసిపోని విధంగా వున్నారు. మంచి ప్రతిభ కల్గిన వారున్నారు. వారికి మంచి ఉత్సాహం ఉంది. ఆ ఉత్సాహానికి రాజకీయ సంకల్పం జోడించినట్లయితే మనదేశం ఏదిశలో పయనించాలంటే అదే దిశగా వెళుతుంది. అంటే శాస్త్రవేత్తలకు ప్రభుత్వ సహకారం అవసరం. ప్రథమంగా ప్రాథమిక వనరులను (భూమి, నీరు) అభివృద్ధి చేసుకోవాలి. ఏ భూమిలో ఏ పంట వేయాలి అనే ముందు భూసార పరీక్ష చేయాలి. అపుడు మనకు కర్తవ్యం బోధపడుతుంది. దీనికి ప్రభుత్వ సహకారం చాలా అవసరం.

ఇక భూసంస్కరణలు, కౌలు విషయాలను పరిశీలించినట్లయితే ఈ రెండింటికి అవినాభావ సంబంధం ఉంది. భూసంస్కరణల లోపం లేకుండా, ఒక క్రమపద్ధతిలో ప్రత్యేకంగా అమలు జరిపినట్లయితే పంటలను అభివృద్ధి చేసుకోవడం తథ్యం. లేదంటే తిరోగమన పరిస్థితి నెలకొంటుంది. ఏ దేశంలోగాని, ఏ రాష్ట్రంలోగాని పరిశీలించినా LAND CONSOLIDETION (భూమి మధింపు) ఎక్కడైతే జరిగిందో అక్కడ ఉత్పత్తి పెరిగింది. ఎక్కడైతే భూమి ముక్కలు ముక్కలుగా చేసి ఉందో అక్కడ ఉత్పత్తిలో తగ్గుదల కన్పిస్తున్నది. ఇక్కడే ఇబ్బందులను ఎదుర్కొంటున్నాం. ఈ రెంటింటిని సమన్వయం చేసి, ఫలితంగా వ్యవసాయ ఉత్పత్తిని పెంచే విధంగా ప్రయత్నం చేయాలి. ఇక కౌలు చట్టం అమలు జరిపే రీతి సరిగ్గా లేదు. వ్యవసాయ ఉత్పత్తిని పెంచే క్రమంలో భూసంస్కరణలతో పాటుగా కౌలు చట్టాన్ని కూడా సంస్కరించినపుడే ఉత్పత్తిని పెంచుకునే అవకాశం ఉంది.

నీటి వనరుల విషయానికి వస్తే కరువు ప్రాంతాలైన రాయలసీమ, తెలంగాణా ప్రాంతాలలో చావుబ్రతుకుల మధ్య ఉన్న పంటకు ఒక తడి ఇచ్చినట్లయితే పంట రెండు మూడు రెట్లు దిగుబడి వస్తుంది. కాని నీటి యాజమాన్యం విషయంలో ఒక క్రమపద్ధతిగా లేదు. గోదావరి జిల్లాల్లో అడుగునీరు పెడుతుంటారు. యాజమాన్యం అంటే ఇరిగేషన్ మరియు డ్రైనేజిని గురించి ఆలోచించాలి. మనం ఎపుడూ ఇరిగేషన్ పైన ఆలోచన తప్ప డ్రైనేజి గురించి అంతగా పట్టించుకోము. దాని గూర్చి ఆలోచించం. ఇపుడు కూడా ఆలోచించడం లేదు. కృష్ణ, గోదావరి జిల్లాలలో సుమారు 700-800 కోట్ల రూపాయలతో డ్రైనేజి పనులు చేపడుతున్నారు. ఇదే ప్రాజెక్టు ప్రారంభించినపుడే డ్రైనేజి గురించి ఆలోచన ఉన్నట్లయితే ఇంకా మనం అధిక దిగుబడిని ఆశించవచ్చు. కాని ఇది మనదేశంలో నిర్లక్ష్యం చేయబడుతున్నది. గతంలో చెప్పినట్లు రాబోవు కాలంలో



పాతాళ గంగ కూడా తరిగిపోతున్నది. అంటే మైనర ఇరిగేషనకు ప్రాధాన్యతను ఇచ్చి ఎన్నో చెక్‌డామ్స్ కట్టవలసి వుంది. అపుడే అభివృద్ధిని సాధించగలం.

వీటి అన్నింటికి తోడుగా, సాంకేతిక పరిజ్ఞానం అవసరం. అంటే ఏ పంట వేయాలి. ఎంత వేయాలి. ఎంత మోతాదులో పురుగు మందులు వాడాలి. ఎంత విత్తనం వేయాలి అనే మొత్తం విషయాన్ని సాంకేతిక పరిజ్ఞానం అంటాం. ఈ పనిని ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వ విద్యాలయం చేస్తుంది. అదృష్టవశాత్తు మన రాష్ట్రంలో 71 పరిశోధనా కేంద్రాలు వున్నాయి. ఏ రాష్ట్రంలోనూ ఇన్ని కేంద్రాలు లేవు. ఉదా: కృష్ణ, గోదావరి జిల్లాలో ఉన్న కేంద్రాలు పంజాబ్, హర్యానా రాష్ట్రాల్లో కలిపి అన్ని వున్నాయి. అన్ని పరిస్థితులు అనుకూలించినా వాటికి తగినన్ని నిధులు రాష్ట్రంలోనూ, దేశంలోనూ కూడా లేవు. ఈ కేటాయింపు హెక్టారుకు మన రాష్ట్రంలో రు.3 ఉంటే పంజాబ్‌లో రు.11 ఉంటున్నది.

ఇక వ్యవసాయ పరిశోధనకు ఎంత పెట్టుబడి పెడుతున్నామంటే దేశంలోనే తలసరి పెట్టుబడికంటే రాష్ట్రంలో ఇంకా తక్కువగానే ఉంది. అయితే 1966లో వ్యవసాయ విశ్వవిద్యాలయం వచ్చిన తరువాత 175 రకాల వంగడాలను విడుదల చేశాం. అవి రైతుల మన్నన కూడా పొందాయి. గతంలో 10-15 బస్తాల దిగుబడి సాధించిన పరిస్థితి నుండి ప్రస్తుతం 30 బస్తాల వరకు, కొన్ని చోట్ల 40 బస్తాల వరకు సాధిస్తున్నాం. అలాగే మొక్కజొన్న విషయంలో కూడా. ఎరువులలో తీసుకున్నట్లయితే 12-13 లక్షల టన్నులు వరకు పెరిగింది. భారతదేశంలో ఎక్కువ ఎరువులు వాడే 10 జిల్లాలలో మన రాష్ట్రంలోనే 5 జిల్లాలు వున్నాయి. అయితే భవిష్యత్‌లో ఇంకా సాంకేతిక పరిజ్ఞానం పెరిగేందుకు అవకాశం వుంది. దీనికి 4 అంశాలు పరిశీలించాలి. 1.వనరులు 2. సాంకేతిక పరిజ్ఞానం 3.విస్తరణ. 4.impults (ఉత్పాదితాలు.) మొదటిగా ప్రాథమిక ...నటువంటి వనరుల వినియోగం విషయంలో జాగ్రత్తవహించిన తర్వాత దానికి సాంకేతిక పరిజ్ఞానం జోడించాలి. తర్వాత దీనంతటికి విస్తరణ చాలా అవసరం. వీటిలో ఏది లోపం జరిగినా అనుకున్న ఫలితాలు సాధించలేము.

మొదటగా విత్తనం వరకు తీసుకున్నట్లయితే మేము ...ప్పిన విధంగానే రైతులు ఆచరిస్తున్నారు. కాని మిగిలినవి ...రుగుమందులు వాడకం, ఎరువులు విషయాలలో మేము ...ప్పన విషయానికి భిన్నంగా విభిన్న పద్ధతులు అవలంభిస్తున్నారు. ...రణం ఈ విషయాలపై కంట్రోల్ లేకపోవడమేనని మా ...ర్వేలో తెలిసింది. ఉదా: ఎరువును 5 సెం.మీ. నీటిలో ...యమని చెప్పినట్లయితే రైతు 2 లేక 3 అడుగుల లోతులో ...స్తాడు. ఎరువు వేసిన 24 గంటల వ్యవధిలో నీరు పెట్టాలి అనే ...తు కూడా నిర్లక్ష్యం చేయబడుతున్నది. ఇది సహజం ...ఉకున్నట్లయితే కొన్ని అసహజంగా వున్నాయి. ఉదా: పురుగు ...దులు 2 మీ.లీ. వేయమంటే 4 మీ.లీ. వేస్తాడు. ఏ పురుగు ...దు కొట్టవద్దని సిఫార్సు చేస్తామో అదే పురుగు మందు ...టతున్నాడు. ఇది అసహజంగా జరుగుతున్న లోపం. రైతు ...రణలో ఆర్థిక వనరుల స్థితిని కూడా ఆలోచించాలి. ఆర్థిక వనరులు లేని వారు తనకు ఉన్న పరిమితిలోనే ఆచరణ వుంటుంది. ఉదా: హైబ్రీడ్ విత్తనాలు మంచివి అని తెలిసినా వాటిని కొనుగోలు చేయలేని స్థితిలో వున్నందున వీటని వాడే స్థితి ఉండదు.

నీటి వనరులలో మన రాష్ట్రంలో బాగా అభివృద్ధి చెందింది అనుకోండి. అయినప్పటికీ 50 శాతం, 60 శాతం మెట్ట సేద్యం ఉండాల్సిందే. ఎంత సాంకేతిక పరిజ్ఞానం అమలు జరిగినప్పటికీ ఈ మెట్ట సేద్యంలో ఉన్న ఇబ్బందులను తొలగించే పరిజ్ఞానం ఇప్పటి వరకు లేదు. పంట దిగుబడి 2,3 రెట్లు పెంచే విధంగా మేము సూచించినప్పటికి అది ఆచరణలో భిన్నంగా వుంటుంది. నీటి వనరుల అమలు సౌకర్యం వున్న రైతు ఆచరణలో చేస్తాడు. కాని అదే రైతు నీటి వనరులు లేని వద్ద ఈ ఆచరణలో ఇబ్బందులు ఎదుర్కొంటాడు. ఆ రైతుకు మనం చెప్పిన విధంగా కాకుండా తనకు ఇష్టమైన రీతిలో ఆచరణ గావిస్తాడు. మెట్ట ప్రాంతాల్లో ఉన్న రైతాంగం స్థితిగతులను మెరుగు పర్చాలనే దృక్పథం ఉన్నట్లయితే ఇప్పటి నుండే దాని గురించి కృషి చేసినట్లయితే రాబోవు తరాలకు కృష్ణ, గోదావరి రైతాంగం వలే చేయడం అసాధ్యం ఏమీ కాదు. వీటి అన్నింటితో పాటుగా విస్తరణ అనేది చాలా ముఖ్యం. దీనితో పాటు Imputs అనేది కూడా ప్రధానమైంది. ఇక విత్తనం పరిస్థితిని గమనించినట్లయితే నేను చూచినప్పటి నుండి ఇంత అధ్వాన్నంగా ఎపుడూ లేదు. జాతీయ స్థాయిలోనూ, ప్రతి రాష్ట్రంలోనూ విత్తనాభివృద్ధి సంస్థలు వున్నాయి అయినప్పటికి రైతుకు నాణ్యమైన మంచి విత్తనం అందించలేకపోతున్నాం మంచి విత్తనం గనుక మనం రైతుకు అందించినట్లయితే ఏ అధికారి చెప్పకుండానే రైతు తన పని తాను చేసుకోగలడు. అయితే ఈ విత్తనాల్లో ప్రయివేటు Monopoly వచ్చింది.

ఇక ఎరువుల విషయంలో సద్వినియోగం చేసుకోవాల్సిన బాధ్యత రైతుది. సాధ్యమైనంతవరకు సహజ ఎరువును వేసుకోవాలి. సేంద్రియ ఎరువులలో మీ యిష్టం. సహజ ఎరువు వేయడం రైతుకు ఎంతో లాభం. ఎరువు ఎంత వేశాం అనేది కాకుండా ఎంత సద్వినియోగం అయింది అనేది గమనించాలి. చైనాలో సేంద్రియ ఎరువులు ముందుతడి తర్వాత రసాయన ఎరువులు వాడతారు. అందువల్ల అక్కడ మనకంటే సాగుభూమి తక్కువగా ఉన్నప్పటికి దిగుబడి 9 రెట్లు ఎక్కువగా వున్నది. ఈ విషయాన్ని మనం గమనంలో వుంచుకోవాలి.

చివరగా అప్పు విషయాన్ని పరిశీలించినట్లయితే ఆర్థిక వనరులు సకాలంలో సమకూరక, పంటను సరియైన టైంలో వేయకపోవడంచేత మేం చెప్పిన పద్ధతులు ఆచరణలో అమలు కావడం లేదు. మార్కెటింగ్ వ్యవహారంలో రైతులు ఎవరికి వారే యమునా తీరే అనే విధంగా వుంటున్నది. రైతు సంఘాలు వున్నాయి. మహారాష్ట్ర, పంజాబ్‌లలో రైతులు ఉత్పత్తి సహకార సంఘాలు పెట్టుకొన్నారు. దానివలన రైతులు మంచి ఫలితాలు సాధిస్తున్నారు. వారి పంటలకు గిట్టుబాటు ధరలు సాధించుకుంటున్నారు. ఇది మన రాష్ట్రంలో లేదు. అందుకు కృషి చేయాలి.

# రాష్ట్రంలో వ్యవసాయ తీరుతెన్నులు తక్షణ కర్తవ్యాలు

డాక్టర్ కె.వి.ఆర్.చౌదరి

మన రాష్ట్ర వ్యవసాయ అభివృద్ధిపై కొన్ని అపోహలు, భ్రమలు వున్నాయి. కొందరు మూడు పువ్వులు ఆరు కాయలుగా ఉందని, మరి కొందరు నత్తనడకగా వుందని చెపుతున్నారు. మన రాష్ట్ర వ్యవసాయ పరిస్థితిని తెల్సుకోవాలంటే జాతీయ స్థాయిలోను, వివిధ రాష్ట్రాల వ్యవసాయ పరిస్థితితో పోల్చినపుడు మనకు అవగతమవుతుంది. అధికార పత్రాలను పరిశీలించినపుడు మన రాష్ట్ర పరిస్థితి కొన్ని ప్రత్యేక లక్షణాలను కలిగి వుందని చెప్పవచ్చును. జాతీయ స్థాయిలో కంటే మన రాష్ట్రంలో సగటు వనరులు ఎక్కువగా వున్నాయి. హెక్టారుకు రసాయనిక ఎరువుల వాడకం కూడా ఎక్కువగానే వుంది. దేశం మొత్తం మీద రసాయనిక ఎరువులు వాడే జిల్లాలలో గుంటూరు ప్రథమ స్థానం. పశ్చిమ గోదావరి రెండవ స్థానం. కృష్ణాజిల్లా మూడవ స్థానంలో వుంది. అలాగే పురుగుమందులు వాడకం కూడా ఎక్కువగా వుంటున్నది. ఇన్ని వనరులు ఉన్నప్పటికి మనం అభివృద్ధి సాధించలేకపోయాం. మన రాష్ట్ర సగటు ఉత్పత్తి జాతీయస్థాయిలో సగటు ఉత్పత్తి కంటే తక్కువగా ఉంది. ఒకటి, రెండు మాగాణి పంటల దిగుబడులు మాత్రం ఎక్కువగా వున్నాయి. వర్షాధార పైర్ల దిగుబడి తక్కువగాను నష్టాలు ఎక్కువగా వున్నాయి. అంతేకాదు వ్యవసాయంపై ఆధారపడి జీవించే వారి సంఖ్య కూడా ఎక్కువగానే ఉంది. వ్యవసాయ కార్మికుని తలసరి ఉత్పత్తి తక్కువ. గ్రామీణ ప్రాంత తలసరి ఉత్పత్తి జాతీయ స్థాయి తలసరి ఉత్పత్తి కంటే 20 శాతం తక్కువగా వుంది. ఇక రాష్ట్రాల విషయానికి వచ్చినట్లయితే పంజాబ్‌లోను, మన రాష్ట్రంలోనూ నీటి వసతి సమానంగా వుంది. మనకు కాలువల ద్వారా 50 శాతం నీటివసతి ఉండగా, పంజాబ్‌లో బావుల ద్వారా 62 శాతం వుంది. అయితే పంజాబ్‌లో నీటి వనరులను సమతూకంగా ఉపయోగించుకుని, మంచి ఫలితాలు సాధిస్తున్నారు. కాని మన రాష్ట్రంలో ఈ నీటి వనరుల వినియోగంలో అంతా అస్తవ్యస్తంగా వుంది. కోస్తా మగాణి పైర్లకు వేసే ఎరువులో 65 శాతం నీటిలో కొట్టుకొని పోతున్నది. అందువల్ల వ్యవసాయ ఉత్పత్తి ఖర్చులు పెరగడమేకాదు ఉత్పత్తి కూడా తగ్గుతున్నది. క్వింటాలు ఉత్పత్తి చేయడానికి పంజాబ్‌లో కంటే మన రాష్ట్రంలో 30 శాతం ఖర్చులు ఎక్కువ అవుతున్నాయి. అంతే కాదు వ్యవసాయరంగం తలసరి ఆదాయం 6 రెట్లు ఎక్కువ.

మన రాష్ట్ర వ్యవసాయ స్థితిగతులను పరిశీలించినట్లయితే 1970-71 నుండి 1986-87 సంవత్సర కాలంలో వ్యవసాయ అభివృద్ధి సగటున 2 శాతం మాత్రమే వుంది. ఆహారధాన్యాల పరిస్థితి మరీ అధ్వాన్నంగా వుంది. 1969-70లో తలసరి ఆహారధాన్యాల ఉత్పత్తి 170కె.జిలు ఉండగా 1989-90నాటికి 175 కె.జి.లు పెరిగింది. అంటే కేవలం 20 సంవత్సరాలలో 5 కె.జి.లు మాత్రమే పెంచుకోగలిగాం. పెరుగుదల రేటు 0.2 శాతం అన్నమాట. ఇది దేశం మొత్తం మీద తక్కువ. ఇదే కాలంలో పంజాబ్‌లో 473 కె.జి.ల నుండి 881 కె.జి.లకు అంటే 33 శాతం గాను, ఉత్తరప్రదేశ్‌లో 1.8 శాతంగా వుంది. ఇంకా హర్యానా, తమిళనాడులో కూడా ఈ పెరుగుదల రేటు ఉంది. అంతేకాదు వ్యవసాయ ఉత్పత్తి ఖర్చుల విషయంలో కూడా దేశం మొత్తం కంటే మనమే ఎక్కువగా ఖర్చు పెడుతున్నాం ఎరువులు, పురుగుమందులు, విత్తనాలకు మొదలుగు వాటిపై అధికంగా ఖర్చు చేస్తున్నట్లు మేం జరిపిన లెక్కల సేకరణలో తెల్సింది. అయితే ఉత్పత్తి పెరిగింది అంటే అదీ లేదు. ఉదా: వరి హెక్టార్‌కు మన రాష్ట్రంలో 34 క్వింటాలు ఉండగా, కర్నాటకలో 37 క్వింటాలు, హర్యానాలో 38 క్వింటాలు, తమిళనాడులో 40 క్వింటాలు, పంజాబ్‌లో 52 క్వింటాలు ఉంది. అలాగే మొక్కజొన్న, వేరుశెనగలో కూడా ఇదే స్థితి ఉంది. మన రాష్ట్రంలో [illegible] ఉత్పత్తి 70 టన్నులు ఉండగా కర్నాటకలో 80 టన్ను[illegible] మహారాష్ట్రలో 89 టన్నులు, తమిళనాడులో 101 టన్నులు ఉంది. ప్రత్తి ఉత్పత్తి మనం 2.5 క్వింటాలు పండిస్తుండగా తమిళనాడులో 3.25 క్వింటాలు. పంజాబ్‌లో 5 7 క్వింటాలు ఉంది. పొగాకు విషయంలో మనకి గర్వపడుతున్నామనుకుంటే అది పొరపాటే. ఇక్కడ మనం 12 క్వింటాలు వస్తొంటే గుజరాత్‌లో 16 క్వింటాలుగా వుంది. పై లెక్కలు మన రాష్ట్రంలో వ్యవసాయ ఉత్పత్తి తక్కువగా వుంద[illegible] తెలియచేస్తున్నాయి. 1970-71 నుండి 1986-87 మధ్య వ్యవసాయ ఉత్పాదకత పెరుగుదల లేదుకదా స్థంభించి పోయింది

1971-72 లో వ్యవసాయ కార్మికుని తలసరి ఆదాయ[illegible] రు.2156 ఉండగా 1988-87 లో 2088 మాత్రమే వుంది. వా[illegible] ఆదాయాల పెరుగుదల లేదుసరికదా తగ్గినవి. కాని వ్యవసాయేత[illegible] రంగంలో 1970-71లో 4889 ఉంటే 86-89లో సుమారు 7000కు పెరిగింది. అంటే వ్యవసాయ రంగంలో అనుకూల[illegible] తగ్గుతున్నది అని తెలుస్తున్నది. కాగా వ్యవసాయ రంగంలో ప్రాంతీయ అసమానతలు కొట్టవచ్చినట్లు కన్పిస్తున్నాయి. [illegible] కాలంలో వరి ఉత్పత్తి పెరిగింది. ఈ పెరిగిన ఉత్పత్తి కేవలం జిల్లాల నుండి మాత్రమే వచ్చింది. అవి తూర్పుగోదావ[illegible] పశ్చిమగోదావరి, నెల్లూరు, ప్రకాశం, చిత్తూరు, నల్గొండ నుం[illegible] 75 శాతం పెరిగింది.

మన రాష్ట్రంలో వ్యవసాయ అభివృద్ధి వంకరటింకర వుంది. దీనికి ముఖ్యంగా 3 కారణాలు వున్నాయి.

1. సాగునీటి వసతిలో అసమానతలు
2. స్వాతంత్ర్యం తరాత కల్పించిన నీటివసతిపై పాలకు

కొన్ని ప్రాంతాలపై పక్షపాతం చూపడం.
3.నీటి వసతి ఎక్కువగా ఉన్నచోట నూతన ఉత్పాదకాలు, రసాయనాలు వాడడం.

ఇటీవల కాలంలో నీటి వసతి సౌకర్యాలు కల్పించారు. ఈ వసతి కల్పించడంలో కూడా పక్షపాతమే కన్పిస్తున్నది. 1986-87లో నీటివసతి సౌకర్యం పశ్చిమ గోదావరిలో 86 శాతం ఉండగా నెల్లూరులో 77 శాతం, కృష్ణాలో 73 శాతం ఉంది కాని అదేకాలంలో ఆదిలాబాద్‌లో 8 శాతం, మెదక్‌లో 10 శాతం, అనంతపూర్‌లో 13 శాతం, మహబూబ్‌నగర్‌లో 11 శాతం ఉంది. 1970-71 నుండి 85-86 మధ్య కాలంలో గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, కృష్ణా జిల్లాలలో నికరంగా నీటి వసతి కల్పించడంలో 81 శాతం పెరుగుదల ఉంది. తక్కిన జిల్లాలో నీటివసతి తక్కువగా వుంది. ఎక్కడైతే నీటి సౌకర్యం ఉంటుందో అక్కడే సాంకేతిక పరిజ్ఞానం, రసాయనాలు వాడకం ఎక్కువగానే వుంటుంది. అందువలన ప్రాంతీయ అసమానతలు కన్పిస్తున్నాయి.


సెమినార్‌లో కె.వి.ఆర్.చౌదరి

ఇంతవరకు పరిశీలించినంతవరకు జాతీయ స్థాయిని పోల్చినట్లయితే ఉత్పాదకత తక్కువ. తలసరి ఆదాయం తక్కువ, ఉత్పత్తి ఖర్చులు ఎక్కువగా ఉన్నవి. ఈ సమస్యలను పరిష్కరించుకోవడానికి ఏ కార్యక్రమాలు, చర్యలు తీసుకోవాలో పరిశీలిద్దాం.

మెట్ట ప్రాంతంగా ఉన్నటువంటి 3 కోట్ల ఎకరాలు (60 శాతం) వర్షాధారితంగా వున్నదాన్ని అభివృద్ధి చేయాలి. మాగాణి పైర్ల దిగుబడిలో 3వ వంతు కంటే తక్కువగా మెట్టపైర్ల దిగుబడి వుంది. అది కూడా అనిశ్చితంగా వుంది. భూమికోత, మంచినీటి కొరత, నిరుద్యోగం తాండవిస్తున్నాయి. తరతరాలుగా నీటి సౌకర్యం లేని ప్రాంతాలను అభివృద్ధి చేయడం అవసరం. Water grid పథకం వలన అభివృద్ధి ఉంది. అనేక లాభాలు కూడా వున్నాయి. బీడుభూములు సాగులోకి తేవడం. పండ్లతోటలు పెంపకం. పర్యావరణ రక్షణ వంటివి జరుగుతున్నాయి. ఈ పథకం 16 రాష్ట్రాలలోని 99 జిల్లాలో వున్నవి. ఈ పథకాన్ని ఇతర ప్రాంతాలకు కూడా విస్తరింపచేయడం అవసరం. మాగాణికి కల్పించబడిన సౌకర్యాలు మెట్టసేద్యానికి కల్పించబడినట్లయితే చాల మంది రైతులు లాభం పొందుతారు. అలాగే చిన్నతరహా నీటి వసతులు కూడా చాలా తక్కువ ఖర్చుతో కల్పించవచ్చును. సాంఘిక న్యాయం, వ్యవసాయ సామర్థ్యం పెంచాలంటే మనం కొన్ని విషయాలు గుర్తించుకోవాలి.
1.పేదరికం అధికంగా వుండే జిల్లాలైన అనంతపురం, కర్నూల్, రంగారెడ్డి, ఆదిలాబాద్ వంటి వాటికి అదనపు నీటి సౌకర్యం కల్పించాలి.
2.సన్న, చిన్నకారు రైతులకు నీటి సౌకర్యం కల్పించడం.
3. ఆరుతడి పంటలకు నీటి వసతి కల్పించడం.

వర్షపు నీటిని మనం సద్వినియోగం చేసుకున్నట్లయితే మెట్ట ప్రాంతాల దిగుబడి పెరుగుతుంది. సంస్థాగత సంస్కరణలు, వ్యవసాయ సంస్కరణలు చేపట్టవలసిన అవసరం వుంది. ఈ చర్యలు చేపట్టడం వలన అభివృద్ధి అనివార్యం. ప్రాంతీయ అసమానతలు కూడా వున్నాయి. కాని మహబూబ్‌నగర్, రంగారెడ్డి, అనంతపూర్ జిల్లాలో 64 శాతం ఉంది. ఈ అసమానతలు తొలగించడానికి బడ్జెట్‌లో కేటాయింపు జరగాల్సిన అవసరం వుందని.

ఇక భూ సంస్కరణల విషయానికి వచ్చినట్లయితే భూటక సంస్కరణలుగా వున్నాయి. వాటిని ఖచ్చితంగా అమలు చేయాలి. అలాగే-కౌలుదారీ చట్టాన్ని సమీక్షించవల్సి ఉంది. రైతుకు కౌలు గ్యారంటీ లేదు. రక్షణ లేదు. ఈ చట్టాలు బెంగాల్, కేరళలో బాగా అమలు జరిపారు. అక్కడ కౌలుదార్లుకు మంచి రక్షణ ఉండటమేగాక లాభం పొందుతున్నారు. మన రాష్ట్రంలో కూడా ఆ చర్యలు చేపట్టవలసి వుంది. దేవాలయ భూములను ఎప్పటి నుండో సాగు చేస్తున్నారు. ఆ భూములను వేలం వేయకుండా, సరియైన కౌలుదార్లను గుర్తించి వారికి ఇవ్వాలి.
-రైతుల పంటలకు గిట్టుబాటుధరలు కల్పించాలి. ధరలు నిర్ణయించడంలో రైతులకు కాకుండా మధ్య దళారులకు లాభం వుంటున్నది. అందువలన ధరలు నిర్ణయించే కమిటీలో రైతులకు భాగస్వామ్యం కల్పించాలి.
-పరిశ్రమల్లో యజమాని తన లాభాన్ని తాను తీసుకుంటాడు. అందువల్ల రైతుకు రిస్క్ క్రింది 15 శాతం ఇవ్వాలని భావిస్తున్నాను. ద్రవ్యోల్బణాన్ని పరిగణలోకి తీసుకొని ధరలు నిర్ణయించాలి.
-మార్కెట్ విషయంలో ప్రభుత్వ సంస్థల పనితీరు అధ్వాన్నంగా వుంది. ఈ విషయంలో పొగాకు పరిస్థితి మీకు తెలుసు. అంతేకాదు మార్కెట్ జరిగే దంతా యార్డ్‌బయటనే జరుగుతుంది. దానిని సంస్కరించాలి.
-రాష్ట్రంలో 62 లక్షల మంది సన్న, చిన్నకారు రైతులు వున్నారు. వారు పెట్టుబడి పెట్టే స్థితిలో లేరు. వీరికి అవకాశం కల్పించాలి. మిశ్రమ సేద్య పద్ధతులు కల్పించాలి. కాని ప్రభుత్వం ఈ విషయంలో నిర్లక్ష్య వైఖరి ప్రదర్శిస్తోంది.
-మన ప్రభుత్వానికి పై చర్యలు చేపట్టడంలో చిత్తశుద్ధి ఉందా అని అడుగుతున్నాను. రాజకీయ వత్తిడి లేకుండా, ఎలాంటి పోరాటాలు లేకుండా వీటిని సాధించడం కష్టసాధ్యం. అందువల్ల మనమంతా ఐక్యంగా వుండి, రైతు సంఘంగా పోరాడాలి. ఇప్పటికే ఆ కృషిని ఆంధ్రప్రదేశ్ రైతు సంఘం చేస్తున్నది. చేసింది కూడా. రైతాంగ సమస్యలపై మరింతగా కృషి చేస్తుందని గట్టిగా నమ్ముతున్నాను.

# భారతదేశంలో వ్యవసాయ సంక్షోభం ప్రత్యామ్నాయ పరిస్థితులు

విప్లవదాస్ గుప్తా

ఇటీవల వచ్చిన రాజకీయ మార్పులు, వ్యవసాయ రంగంపై దాని ప్రభావం ఎలా వుంటుంది అనే విషయాన్ని పరిశీలిద్దాం.

గత పది నెలల కాలంలో అంటే గత జూలై నుండి రెండు బడ్జెట్‌లు ప్రవేశపెట్టబడ్డాయి. ఐ.ఎం.ఎఫ్., ప్రపంచ బ్యాంక్ అప్పులిచ్చినప్పుడు పెట్టిన షరతులు, బ్యాంకుల విషయంలో నరసింహం కమిటీ చేసిన సూచనలు, అంతర్జాతీయ వ్యాపార సంబంధాలను నిర్దేశించే గాట్ అధ్యక్షులు డంకెల్ ప్రతిపాదనలు మనం చూస్తున్నాం. వీటన్నటి మధ్య అవినాభావ సంబంధం వుంది. ఈ ప్రతిపాదనలవల్ల వ్యవసాయ రంగాన్ని సంక్షోభంలోకి నెట్టే అవకాశం వున్నది.

పై తాత్విక ధోరణి వలన ప్రతి ఒక్కటి మార్కెట్ పైననే ఆధారపడాలని, లాభాపేక్షే ప్రధానంగా వుంటున్నది. వీటికి అనుగుణంగా ఎగుమతి దిగుమతి ఆంక్షలు తొలగించడం, బహుళ జాతి కంపెనీలు, దేశంలోకి విచ్చలవిడిగా చొరబాటుకు అవకాశం కల్పించడం, పబ్లిక్ సెక్టార్‌ను తగ్గించడం, కుదించివేయడం లేదా దాన్ని తీసివేయడం, ప్రైవేట్ రంగాన్ని విస్తృతం చేయాలని నిర్దేశిస్తున్నది. దీనిలో భాగంగానే ప్రపంచ బ్యాంక్, ఐ.ఎం.ఎఫ్.లు మన ఆర్థిక వ్యవస్థలో సబ్సిడీలను తగ్గించమని కోరుతున్నది. దానికి అనుగుణంగానే వాటిని పూర్తిగా తీసివేయకపోయినా తగ్గించింది మన ప్రభుత్వం. ఈ చర్యల వలన మన దేశ ఆర్థిక వ్యవస్థ స్వావలంబనను కోల్పోవడం, ఇతర దేశాలపై ఆధారపడే విధంగా తయారవుతున్నది. దేశాన్ని దృఢపరిచే బదులు బలహీనపరిచే చర్యలుగా వున్నవి.

ఈ విధానాలు మన దేశాన్ని ఏ విధంగా దివాళా తీస్తున్నవో పరిశీలిద్దాం. గత వక్తలు చెప్పినట్లు 1965 తరువాత వ్యవసాయ ఉత్పత్తి పెరిగింది. అయితే దీనికి ఒక కారణం రైతులు విత్తనాలు కొనడానికి, ఎరువులు వాడడానికి కావల్సిన రుణ సౌకర్యం బ్యాంకులు కల్పించాయి. ఈ బ్యాంకులు గత 20 సంవత్సరాలలో గ్రామీణ ప్రాంతాల్లో అనేక బ్రాంచిలు పెట్టాయి. పెద్ద మండలాల్లో ఏదో బ్యాంకు ఉంటున్నది. ఈ బ్రాంచీలలో ఉన్న మొత్తం మార్కెట్‌లో 50 శాతం ధనవంతులకు ఏదో ఒక అకౌంట్ వుండేది. ఇలా బ్యాంకులు విస్తరించడం, ఆ తరువాత జాతీయకరణ వలన రైతులు అందరికీ బ్యాంకులు అందుబాటులోకి వచ్చాయి. ఇలా బ్యాంకులు కల్పించిన రుణ సౌకర్యం వలన రైతులు వ్యవసాయ పెట్టుబడులు పెట్టి వారి జీవన స్థితిగతులు మెరుగుపర్చుకున్నారు. ప్రాధాన్యతా రంగం అయిన వ్యవసాయ రంగానికి ఇప్పటి వరకు బ్యాంకులు తక్కువవడ్డీతో అప్పులిస్తుండేవి. కాని వాటిని తొలగించాలని ప్రతిపాదిస్తున్నది. బ్యాంకింగ్ వ్యవస్థలో వచ్చిన నష్టాలను పూరించడానికి ఈ ప్రతిపాదనలు అని ఈ కమిటీ చెప్తున్నది. బ్యాంకులు కొద్దిగా నష్టపోయినప్పటికి గ్రామీణ ప్రాంత రైతులు, పేద ప్రజానీకం, వ్యవసాయరంగం అభివృద్ధి చెందుతున్నది అనేది గమనించవల్సిన విషయం. గ్రామీణ అభివృద్ధికి ఈ బ్యాంకులు సహాయపడుతున్నాయి అనడంలో ఏ మాత్రం సందేహంలేదు. అంతేకాదు 40శాతం వరకు వ్యవసాయ రంగానికి ఇస్తున్న అప్పులను 10 శాతం తగ్గించాలని సూచించింది. ఈ ప్రతిపాదనల వలన బ్యాంకులు లాభాలు ఆర్జిస్తాయి అని చెపుతున్నారు. కానీ ఆచరణలో అది జరగదు అనేది వాస్తవం.

ఇక బ్యాంకులను ప్రయివేటీకరించడం, మన బ్యాంకింగ్ వ్యవస్థలోకి విదేశీ బ్యాంకింగ్ వ్యవస్థ వంటివి మన ఆర్థిక వ్యవస్థకు తీరని నష్టం. ఇప్పటివరకు ప్రభుత్వం ఆ చర్యకు పూనుకోకపోయినప్పటికి రాబోవు కాలంలో ఆ అవకాశం లేకపోలేదు. బ్యాంకులు జాతీయకరణ చేయకముందు ప్రయివేటు వ్యక్తుల చేతులలో వుండేవి. అవి వారి పరిశ్రమల పెట్టుబడికే సరిపోయేవి. కాని జాతీయం చేసిన తరువాత వ్యవసాయ రంగానికి అప్పులివ్వడం, తద్వారా వ్యవసాయభివృద్ధి జరిపి సస్య విప్లవం రావడానికి అవకాశం కల్పించబడింది. ఈ విప్లవం వల్లనే మనదేశం ఆహార ధాన్యాల ఉత్పత్తిలో ఇతర దేశాలపై ఆధారపడే స్థితి నుండి గట్టెక్కగలిగాం. అయితే నరసింహం కమిటీ అమలు జరిపినట్లయితే ఇక రైతులకు అప్పులు రావు. ఫలితంగా వ్యవసాయ రంగం దెబ్బతింటుంది. ఇప్పటి వరకు సాధించిన స్వావలంబనను పోగొట్టుకుంటాం. ఆహార ధాన్యాల ఉత్పత్తి తగ్గుతుంది.

1971 రిజర్వు బ్యాంక్ రిపోర్టు ప్రకారం మొత్తం వ్యవసాయ రంగానికి ఇచ్చిన అప్పులో మూడింట రెండు వంతులు వడ్డీ వ్యాపారస్తుల నుండి వచ్చేవి. కేవలం మూడవ భాగం జాతీయ




సెమినార్‌లో విప్లవదాస్ గుప్తా

బ్యాంకులు సహకార సంస్థలు సమకూర్చేవి. అదే 1981 నాటికి వడ్డీ వ్యాపారస్తుల నుండి 1/3 వంతుకు పడిపోయింది. బ్యాంకులు, సహకార సంస్థల నుండి 3/2 వంతుకు పెరిగింది. ఇది మంచి పరిణామం. 1991 నాటికి ప్రకారం సుమారుగా ప్రయివేట్ వడ్డీ వ్యాపారుల నుండి 20 శాతానికి పడిపోగా బ్యాంక్‌లు, కో-ఆపరేటివ్ సంస్థల నుండి 80 శాతానికి పెరిగింది. అయితే ఈ నరసింహం కమిటీ సిఫార్సులను అమలు చేసినట్లయితే మరల రైతాంగం వడ్డీ వ్యాపారులపై ఆధారపడటం వల్ల వ్యవసాయ రంగం సంక్షోభానికి గురౌతుంది.

బ్యాంకుల్ని ఎప్పుడైతే జాతీయం చేయడం జరిగిందో ఫలితంగా వ్యవసాయాభివృద్ధి జరిగి రైతుల ఆదాయాలు పెరగడం, వారి ఆదాయాలు బ్యాంకుల్లో దాచుకోవడం జరిగింది. దానివల్ల ఈ పొదుపు 20 శాతంపైగా చేరింది. ఈ మొత్తాన్ని ప్రణాళికలు వేయడానికి తోడ్పడినాయి. అయితే నరసింహం కమిటీ సూచనలు అమలుపరిచినట్లయితే ఈ పొదుపు మొత్తాన్ని కూడా కోల్పోవలసి వస్తుంది.

వ్యవసాయ రంగానికి అధిక మొత్తాన్ని కేటాయించాలని మనం డిమాండ్ చేయాలి.ఏ జాతీయ బ్యాంక్‌గాని గ్రామీణ ప్రాంతాల్లో పెట్టుబడిని సేకరించి మరల అక్కడ అప్పులు ఇవ్వకుండా పట్టణ ప్రాంతాలకు ఇవ్వడం జరుగుతున్నది. బొంబాయి వంటి పట్టణాల్లో డిపాజిట్ల సేకరణ తక్కువగా ఉన్నప్పటికీ పెట్టుబడి ఎక్కువగా వుంది. ఈ రెండింటికి పొంతనలేదు. దానివల్ల గ్రామీణ ప్రాంత అభివృద్ధి కుంటుపడుతుంది. అందువల్ల గ్రామీణ ప్రాంతాల్లో సేకరించిన పొదుపు మొత్తాల్ని మరల అక్కడే వినియోగించాలని మనం డిమాండ్ చేయాలి. అంతేకాదు. గ్రామ ప్రాంతాల్లో వడ్డీ వ్యాపారులను పూర్తిగా తొలగించి బ్యాంకుల చొరవ ఉండాలని మనం డిమాండ్ చేయాలి. బ్యాంకుల్ని వ్యాపార దృష్టితో చూడకుండా గ్రామ ప్రాంత అభివృద్ధికి పాటుపడేటట్లు చేయాలి.

గాట్ డైరెక్టర్ జనరల్ డంకెల్ ఒక డాక్యుమెంట్‌ను తయారు చేశారు. ఈ డాక్యుమెంట్‌పై అందరూ సంతకం చేయాలని సూచించాడు. ఏ దేశమైతే అలా చేయదో అది ఆత్మహత్య చేసుకొనే స్థితి కి వస్తుంది. డంకెల్ తన ప్రతిపాదనలు చేయడంలో ముఖ్య ఉద్దేశ్యం ఏమంటే కేవలం అమెరికాకు సహాయం చేయడానికి మాత్రమే. అమెరికా చాలా పెద్ద దేశం అని మీకు తెల్సు. చాలా అభివృద్ధి చెందుతుందని చెప్పుతున్నప్పటికీ అక్కడ లోటు కూడా అధికంగా వుంది. 105 మిలియన్ (3 లక్షల కోట్లు) లోటు వుంది. ఈ లోటు వుండటం వల్ల జపాన్ వంటి దేశాలతో పోటీ పడడంలో తన సామర్థ్యం సరిపోవడంలేదు. అందువల్ల తన లోటును భర్తీ చేయడానికి తృతీయ ప్రపంచ దేశాలపై రుద్దివేయడానికి ఈ డంకెల్ ప్రతిపాదనలు.

– ఈ ప్రతిపాదనల్లో దిగుమతులపై ఆంక్షలు తీసివేయాలని చెప్పింది. దీనివల్ల మన దేశంలోకి విదేశీ దిగుమతులు చొరబడటం జరుగుతుంది. ఫలితంగా మనవ్యవసాయ రంగం తీవ్ర ఇబ్బందుల్లోకి నెట్టబడుతుంది. ఇక కేరళను తీసుకున్నట్లయితే రబ్బరు, జీడిపప్పు దిగుమతికి అవకాశం లేకుండా చేసి మార్కెట్‌కు లేకుండా చేసింది. అదేస్థితిలో కేరళలోకి అనేక వస్తువులను దిగుమతులు చేయడం జరిగింది.దేశం మొత్తంగా చూసినా ఇదే పరిస్థితి వుంది.

– ప్రభుత్వం విదేశాల నుండి విత్తనాలను దిగుమతి చేసుకుంది. స్వామినాథన్ అనే శాస్త్రవేత్త మెక్సికో నుండి పరిశోధనకు 2,3 కె.జీ.ల గోధుమ విత్తనాలు తీసుకొని వచ్చాడు. తన పరిశోధనల ద్వారా మంచి గోధుమ విత్తనాలను తయారు చేశాడు. ఈ విత్తనాలు రైతులకు పంపిణీ చేసి తద్వారా అధికోత్పత్తికి దోహదపడేలా చేశాడు. ఈ విధంగా వ్యవసాయ రంగం, రైతాంగం అభివృద్ధి చెందింది. అయితే ఈ డంకెల్ ప్రతిపాదనల వలన శాస్త్ర పరిశోధనకు అవసరమైన విత్తనాలను దిగుమతి చేసుకొనే అవకాశం వుండదు. వాటిపై ఆ దేశాలకు ఒక విధమైన హక్కు (పేటెంట్) వుంటుంది. అంటే కొత్త పరిశోధనకు తావులేదు. అధిక మొత్తంలో దిగుమతి చేసుకోవాలి. ఫలితంగా కొద్ది పరిశ్రమగా వున్నటువంటి విత్తన పరిశ్రమ కూడా దెబ్బతింటుంది. పెద్ద మొత్తంలో విత్తనాలు దిగుమతి చేసుకోకుండా అవి వ్యవసాయ రంగాన్ని తీవ్ర ఇబ్బందులకు గురిచేయడమే. అక్కడ నుండి మంచి విత్తనాలు వస్తాయి అనే గ్యారంటీ కూడాలేదు.

–1988లో విత్తన దిగుమతిని చేయడం ప్రారంభించాయి. ఈ విధానాన్ని శాస్త్రజ్ఞులు, ఆర్థికవేత్తలు వ్యతిరేకించారు కూడా. ఈ చర్యవలన దేశీయంగా వున్న విత్తన సంస్థలు, శాస్త్ర పరిశోధన దెబ్బతింటాయి. వారిలో ఉత్సాహం కొరవడుతుంది. తమ కృషి, రైతులలో ప్రవేశించనప్పుడు వారినైపుణ్యం దెబ్బతింటుంది. అలాగే శాస్త్రజ్ఞుల పరిశోధనలతో నిమిత్తం లేకుండా విచక్షణారహితంగా విత్తన దిగుమతి చేసుకున్నట్లయితే వ్యవసాయ రంగానికి తీరని నష్టం. మన్‌మోహన్‌సింగ్ ప్రవేశపెట్టిన బడ్జెట్‌లో విత్తనాల దిగుమతిపై అన్ని ఆంక్షలు ఎత్తివేయడం జరిగింది. దీనివల్ల విత్తన దిగుమతికి పూర్తిగా ద్వారాలు తెరవడమే గాకుండా శాస్త్ర పరిశోధన దెబ్బతింటుంది. అంతేకాకుండా పెద్ద మొత్తంలో విత్తన దిగుమతి చేసినప్పుడు ఆ విత్తనాల తనిఖీ సాధ్యపడదు. అందువల్ల మన దేశంలోకి కొత్త జబ్బులు రావడం జరుగుతుంది. ఇది ఊహాజనితంకాదు. వాస్తవం. ఇప్పుడు తీవ్రంగా వున్న జబ్బు టుంగో వైరస్ అనేటటువంటి ఫిలిప్పైన్ డిఫైన్ నుండి దిగుమతి చేసుకొన్న విత్తనాల నుండి వచ్చిందే. దాని నష్టం కూడా తెలుసు. అలాగే గోధుమ విషయంలో కూడా ఇదే పరిస్థితి.

–క్రిమిసంహారక మందుల విషయానికి వచ్చినప్పుడు మన దేశం ఇతర దేశాల నుండి దిగుమతి చేసుకుంటున్నది. ముఖ్యంగా అమెరికా నుండి దిగుమతి చేసుకుంటున్నాం. అయితే వారు ఈ మందులకు అవసరమైన దాని కంటే ఎక్కువ వాడమనిరైతులకు సూచిస్తున్నారు. గతంలో కామ్రేడ్ మధుతో ప్రకాశం, గుంటూరు జిల్లాల్లో సందర్శించాము. అక్కడ ప్రత్తి రైతుల ఆత్మహత్యలు విన్నాం. 37 మంది చనిపోయారు. వారు తమ అప్పుల బారి నుండి బయటపడడానికి ఆర్థిక ఇబ్బందుల నుండి బయటపడటానికి బంగారాన్ని తాకట్టు పెట్టారు. దీనికి కారణం విదేశీ పురుగు మందులు విచక్షణా రహితంగా వాడటమే. కొత్తగా ఎప్పుడైతే పురుగు మందులకు వ్యాపార దృష్టితో సూచనలు చేయడం జరుగుతుందో తప్పక రైతుకు గుంటూరు, ప్రకాశం జిల్లాల్లో పత్తి రైతుల పరిస్థితి ఏర్పడుతుంది.

- డంకెల్ ప్రతిపాదనలు గాని, ఐ.ఎం.ఎఫ్., ప్రపంచ బ్యాంక్ షరతులు గాని సూచించేదేమంటే మన దేశంలో ఇప్పుడు వున్న సబ్సిడీలను తగ్గించడం పూర్తిగా తీసివేయడం. దాని ఫలితంగానే గతంలో ఎరువుల ధరలు 40 శాతం పెరిగాయి. ఇక్కడ ఆందోళన చేయడంలో 30 శాతంకి తగ్గించింది. అయితే ఎరువుల ధరలు ఇంతవరకు పెంచకపోయినప్పటికి కొద్ది నెలల్లో పెంచడం జరుగుతోంది. ఇక ఎరువుల ధరలు పెరగవు అనే ఆలోచనను వెనక్కి తీసుకోవచ్చు. ఈ ఎరువుల ధరలు పెంచినప్పుడు ఒక హామీని వారు ఇస్తున్నారు. ఇది రైతుకు చాలా నష్టం. పెరిగిన ధరలకు, ఉత్పత్తి ఖర్చులకు అనుగుణంగా రైతులకు గిట్టుబాటు ధరలు కల్పిస్తాం అనే హామీ యిస్తున్నారు.

- సబ్సిడీలు ఒక్క భారత దేశానికే పరిమితం కాదు. అమెరికా, ఆస్ట్రేలియా, బ్రిటన్ మొదలగు దేశాలలో కూడా రైతులకు సబ్సిడీలు ఇస్తున్నారు. వాళ్ళ దేశం వరకు సబ్సిడీలు ఇచ్చి మన వరకు సబ్సిడీలు రద్దు చేయండి అని డంకెల్, ప్రపంచ బ్యాంక్, ఐ.ఎం.ఎఫ్. షరతు ద్వారా ఒత్తిడి తెస్తున్నారు. ఇప్పటి వరకు ఆహార సబ్సిడీలలో మాత్రం సబ్సిడీలను తగ్గించకుండా, మిగిలిన వాటిలో ఆ షరతులకు తలొగ్గింది అనే చెప్పాలి.

ఈ షరతుల యొక్క సారాంశం ఏమంటే మన దేశంలాంటి తృతీయ దేశాలలోకి చొరబడిన బహుళ జాతి కంపెనీల దోహదపడే విధంగా ఉంటున్నాయి. ఈ బహుళ జాతి కంపెనీలు ఎంత పెద్దది అంటే పాకిస్తాన్ జాతీయ ఆదాయం కంటే ఒక ఆయిల్ కంపెనీ వార్షిక ఆదాయం ఎక్కువగా వుంది. ఎంత పెద్ద కంపెనీయే దీన్నిబట్టి మనం అర్థం చేసుకోవచ్చు.

-పెప్సికో కంపెనీ మన దేశంలో స్థాపించడానికి భారత ప్రభుత్వం ఒప్పందం చేసుకున్నది. ఈ కంపెనీ స్థాపన ఉద్దేశ్యం శీతల పానీయాలు, బంగాళా దుంప చిప్స్ తయారు చేయడం తమ ఉత్పత్తిలో 40 శాతం విదేశాలకు ఎగుమతి చేసి విదేశీ మారక ద్రవ్యం ఆర్జించాలనే షరతు ఒప్పందంలో ఉంది. నేను లోక్‌సభలో ఉన్నప్పుడు ఒక ప్రశ్నవేశాను. ఈ కంపెనీ ఎంత ఎగుమతి చేసి విదేశీ మారకాన్ని ఆర్జించింది అని కాని ఒక ఔన్స్ కూడాఎగుమతి చేయలేదని తెల్పింది. ఎందుకు జరగలేదంటే తాను ఉత్పత్తి చేసే "టీ"ని ఎగుమతి చేస్తాం అని అంటున్నారు. దీనికి పెప్సి కంపెనీకి సంబంధం లేనప్పటికి ఈ మాటలు అంటున్నారు. ఇలా మోసపూరితంగా ఒప్పందాలు జరుగుతున్నాయి. ఈ దేశంలో బహుళజాతి కంపెనీలు రావడం దేశపరిశ్రమలు పూర్తిగా దివాళా, తద్వారా ఉద్యోగావకాశాలు పూర్తిగా మృగ్యం అవుతున్నాయి.

- మన దేశంలో ఉన్న పరిశ్రమలకు ఏ విధంగా పూర్తి స్వేచ్ఛ ఇస్తున్నామో, విదేశాల నుండి వచ్చిన బహుళజాతి కంపెనీలకు కూడా ఈ విధమైన స్వేచ్ఛ కావాలని డంకెల్ ప్రతిపాదన. ఇలా ఇచ్చినట్లయితేవారు తమకు అవసరమైన సరుకును, కార్మికులను ఎక్కడి నుండి అయినా దిగుమతి చేసుకోవచ్చు. ఉత్పత్తులను ఏ దేశంలోనైనా అమ్ముకోవచ్చు. అంతేకాదు. వచ్చే లాభాలను మన దేశంలో వినియోగానికి కూడా అవకాశాలు వుండకుండా చేస్తుంది. ఇప్పటికే షరతులు ఉన్నప్పటికి వాటిని అతిక్రమించడం జరుగుతుండగా ఏ షరతు లేకుండాపోతే ఎంత పనికి అయినా బరితెగిస్తాయి అనడంలో సందేహంలేదు.

డంకెల్ ప్రతిపాదనలుగాని అంగీకరించినట్లయితే మనదేశ శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానం పరిశోధనలు పూర్తిగా మృగ్యం అవుతాయి అన్న మన సూచనలను ఆర్థికవేత్త ఎప్పుడు అంగీకరించేవారు కాదు. కాని ఈ విషయంలో ఒక స్పష్టీకరణ చేశాడు. ఏదేమంటే ఈ డంకెల్ ప్రతిపాదనలు 30 సం॥ క్రిందటే వచ్చినట్లయితే జపాన్, హాంకాంగ్, చైనా, లాంటి దేశాలు ఉండేవికావు ఈ ఆర్థిక ఊబిలో కూరుకుపోయేవి. గతంలో అయితే దిగుమతి చేసుకునే పరిజ్ఞానాన్ని పూర్తిగా పరిశీలించేవారు. కాని ఇపుడు ఆ పరిస్థితి లేదు. అందువల్ల ఈ స్థితిలో వీటిని అంగీకరించినట్లయితే పశ్చిమదేశాలకు మన ఆర్థికవ్యవస్థను తాకట్టుపెట్టే స్థితికి వస్తాం.

బడ్జెట్‌పైన రెండు విషయాలు చెప్పదల్చుకున్నాను. ఇటీవల పార్లమెంట్‌లో ప్రవేశపెట్టబడిన బడ్జెట్ ఐ.ఎం.ఎఫ్., ప్రపంచబ్యాంక్, డంకెల్ ప్రతిపాదనలు పరిగణనలోకి తీసుకొని తయారు చేయబడిందనే అని చెప్పాలి. ప్రణాళికా ఖర్చు గ్రామీణాభివృద్ధికి విద్యకు, వ్యవసాయ రంగానికి, నీటిపారుదలకు, సాంఘిక సంక్షేమం వంటి కీలకరంగాలకు కేటాయింపులు తగ్గించడం అనేది జరిగింది. దీనివల్ల గ్రామీణ ప్రాంత ప్రజలు బాగా నష్టపోతారు ఇకపోతే మంత్రులు పెద్ద పెద్ద ఆఫీసర్లు తాము ఖర్చుచేసే దానిలో ఏ విధమైన తగ్గింపులుగాని, మార్పులుగాని చేయలేదు పన్నుల విధానం పరిశీలించినట్లయితే అధికజనాభాక ఉపయోగంగా కాకుండా కొద్ది మందికి పనికి వచ్చే విధం రూపొందించడం జరిగింది.

ఆదాయపు పన్ను స్లాబ్‌రేటు 22 వేల నుండి 28వేలక పెంచడం. వల్ల నష్టపోయేది 500 కోట్లు మాత్రమే. కా పన్నురేటు 50-40 శాతం తగ్గించారు. దీనివల్ల కేంద్ర ప్రభుత్ 1000 కోట్లు ఆదాయం తగ్గింది. కొద్దిమందికి మాత్ర 1000కోట్లు ఇచ్చి అధిక శాతంగా వున్న వారికి 500 కో ఇవ్వడం అనేది మీరు అర్థం చేసుకోవచ్చు. ఈ పరిస్థితి వ లాభం పొందిన బడా వ్యాపారస్థులు ఈ బడ్జెట్ గొప్పగా వుం అనే ప్రచారం గావించారు. ఈ చర్యలు ప్రజాబహుళ్యా ఏమాత్రం ఉపయోగపడలేదు అన్న విషయం గమనించాలి.

ఇకదేశంలో వున్న నల్లధనాన్ని వెలికి తీయడానికి ప్రభుత గత బడ్జెట్ ఏ చర్యలు తీసుకోలేదు. 60వేల కోట్ల నల్లధ చెలామణిలో ఉందని అంచనా. ఈ నల్లధనాన్ని వెలికి తీసినట్లయి బడ్జెట్‌లోటు పూడ్చే వీలుంటుంది. గ్రామీణ ప్రాంతాల్లో కు ధనిక భూస్వాములున్నారు. వారి నుండి ఆదాయం రాబట్టటా ఏ విధమైన చర్యలు తీసుకోబడలేదు. అలాగే పరిశ్రమలపై వ లాభాలపై ఏ విధమైన పన్నులు వేయలేదు. ఈ చర చేపట్టకపోవటానికి కారణం ఏమంటే నరసింహం కమిటీ సిఫా చేయలేదని కుంటిసాకు చెపుతున్నది.

చివరగా ప్రభుత్వం బడ్జెట్ ప్రవేశపెట్టే సమయ భూసంస్కరణల గురించి ఒక్కమాట కూడా చెప్పలేదు. ప్రణ ఎజెండా నుండి ఈ విషయాన్ని తీసివేశారు. ప్రభుత్వ ఏక లాభాల దృష్టితో దేశాన్ని పెట్టుబడిదారీ విధాన పయనించేందుకు కృషి చేస్తున్నది. ఈ సమయంలో మహాసభ జరుగుతున్నందున భూసంస్కరణలను ఎజెండ పెట్టడానికి, డంకెల్, ఐ.ఎం.ఎఫ్., ప్రపంచ బ్యాంకు ప్రతినిధు వ్యతిరేకంగా ప్రజలను సమీకరించగలరని కోరుతున్నాను

ఆర్.సి.నెం. కె.బి.ఎ. 333 ఫోన్ : 2098

# ది. ఆకివీడు కో-ఆపరేటివ్ రూరల్ బ్యాంక్ లిమిటెడ్ నెం. 1784

## ఆకివీడు, పశ్చిమ గోదావరి జిల్లా

### ది. 31.3.1992వ తేదీ నాటికి ఆర్థిక ప్రగతి

| | | |
|---|---|---|
| 1) మెంబర్ల సంఖ్య | : | 16,827 |
| 2) మెంబర్ల షేర్ ధనం | : | 50,01,096-62 |
| 3) జిల్లా కేంద్ర సహకార బ్యాంక్‌నుండి అప్పులు | : | ఎస్.టి. 2,74,87,900 |
| | | ఎల్.టి. 2,09,58,548 |
| | | హెచ్.టి. 2,57,020 |
| మొత్తం | | 4,87,03,468 |
| 4) సంఘములోగల డిపాజిట్లు | : | 15,57,800 |
| 5) మెంబర్ల స్వల్ప వాయిదా అప్పులు | : | 2,92,59,016 |
| 6) మెంబర్ల దీర్ఘకాలిక అప్పులు | : | 2,25,13,600 |
| 1989-90 సంవత్సరపు నికర లాభం | : | 1,04,570-63 |



### సౌకర్యములు

1) ఏకగవాక్ష పథకమునందు ప్రగతి సాధించుటలో ఈ బ్యాంక్ అద్భుత విజయము సాధించి జిల్లాలో ఉన్నత స్థానం సాధించింది.
2) డిపాజిట్లపై వాణిజ్య బ్యాంకులకన్నా 1 శాతం అధిక వడ్డీ ఇవ్వబడును.
3) సేఫ్ డిపాజిట్ లాకర్ల సదుపాయము కలదు.
4) మీరు డిపాజిట్ చేసిన సొమ్ము 5 సం॥లలో రెట్టింపు అగు ప్రత్యేక డిపాజిట్ పథకము కలదు.
5) బంగారు నగల హామీపై త్వరలో అప్పులు ఇవ్వబడును.

### పాలకవర్గము

1. శ్రీ ముత్యాల వెంకటేశ్వరరావు, అధ్యక్షులు
2. శ్రీ భూపతిరాజు సోమరాజు, ఉపాధ్యక్షులు
3. శ్రీ కర్రెడ్డి గజపతిరావు, డైరెక్టర్లు
4. శ్రీ ఉదిశే చిన త్రిమూర్తులు ,,
5. శ్రీ పోచికొండ తిరుపాణ్యాదాసు ,,
6. శ్రీ బండారి రాంబాబు ,,
7. శ్రీ జక్కు కృష్ణమూర్తి ,,
8. శ్రీ రామకూరి సంపతరావు ,,
9. శ్రీ చెన్నంశెట్టి శ్రీనివాసరావు ,,
10. శ్రీ జంపన సత్యనారాయణరాజు ,,
11. శ్రీ చొక్కా సత్యనారాయణ ,,
12. శ్రీమతి బొల్లం వసంతకుమారి ,,
13. శ్రీమతి కానూరి సంగమ్మ ,,

**శ్రీ కోసూరి రంగనాధాచార్యులు, సెక్రటరీ**

# పశ్చిమగోదావరి జిల్లాలో వ్యవసాయ రంగం అభివృద్ధి తీరుతెన్నులు

సాంద్ర వ్యవసాయ పథకం అమలు జరుపుతూ అధిక వరి దిగుబడిని సాధించి "దక్షిణ భారతదేశపు ధాన్యాగారం"గా పేరు పొందినది పశ్చిమగోదావరి జిల్లా. వరి పండించటమే కాక జిల్లాలోని

## జిల్లా భౌగోళిక పరిస్థితి

| | | ఎకరాలలో |
|---|---|---|
| మొత్తం విస్తీర్ణం | - | 19,49,650 |
| సాగు చేయబడుతున్న భూమి | - | 11,09,500 |
| బంజరు భూమి, మరియు వ్యవసాయ యోగ్యంకాని భూమి | - | 1,05,808 |
| అడవులు | - | 2,03,050 |
| వ్యవసాయేతర భూములు | - | 2,31,480 |
| ఖాళీగా వున్న వ్యవసాయభూములు | - | 58,312 |
| తోటలు ఇతర చెట్ల క్రింద భూమి | - | 20,178 |
| పచ్చిక బయళ్ళు | - | 97,002 |
| ఇతర ఖాళీ భూములు | - | 80,770 |
| వ్యవసాయ యోగ్యమైన భూమి | | 67% |

మెట్ట ప్రాంతంలో పొగాకు, ప్రత్తి, మిరప తదితర పంటలు కూడా పండిస్తున్నారు. గత 6,7 సంవత్సరాలుగా (చేపలు, రొయ్యలు) చెరువులు విస్తారంగా త్రవ్వి ఉత్పత్తి చేస్తున్నారు. ఈ విధంగా వ్యవసాయ రంగంలో బహుముఖంగా అభివృద్ధి చెందుతున్న పశ్చిమగోదావరి జిల్లాలో వ్యవసాయంలో సాధించిన అభివృద్ధి, అవకాశాలు గురించి, అందుకొరకు రైతు సంఘం నిర్వహిస్తున్న కార్యక్రమం గురించి తెలుసుకుందాము.

మేలు రకం వర్జీనియా పొగాకు కూడా మెట్ట ప్రాంతంలో పండిస్తున్నారు. జిల్లాలో 1960లో వరి పంట ఏడాదికి సగటు ఉత్పత్తి 4 లక్షల టన్నులుకాగా, 1989-90లో 2 పంటలు కలిపి 15 లక్షల టన్నులు రికార్డుస్థాయిలో ఉత్పత్తి అయినట్లు అంచనా. సాగుభూమి పెరగటంతో పాటు, శాస్త్రీయ పద్ధతులలో వ్యవసాయం చేయటం పెరుగుదలకు కారణాలు. ఇప్పుడెదురవుతున్న సమస్యలు పరిష్కరిస్తే ఉత్పత్తి ఇంకా పెంచే అవకాశం ఉన్నది.

### జిల్లాలో ఇరిగేషన్, డ్రైనేజీ వ్యవస్థ

జిల్లాలో డెల్టా ప్రాంతం, మెట్ట ప్రాంతంగా భూమి ఉన్నది. డెల్టా ప్రాంతం ప్రధానంగా గోదావరి నదీ జలాలపైన, కొద్ది భాగం కృష్ణా కాలువపైన ఆధారపడి వున్నది. తూర్పు, పశ్చిమ, గోదావరి జిల్లాల మధ్య ప్రవహిస్తున్న గోదావరి నదిపై ధవళేశ్వరం వద్ద 130 సం.ల క్రితం సర్ ఆర్థర్ కాటన్ పథకంతో నిర్మించబడ్డ ఆనకట్ట సామర్థ్యం, సాగు అయ్యే భూమిని దృష్టిలో ఉంచుకుని రూపొందించినవే అనేది గమనార్హం. గోదావరి నీరు పశ్చిమ డెల్టాలో మొదటి పంటకు 5.16 లక్షల ఎకరాలకు, 2వ పంటకు 3.5 లక్షల ఎకరాలకు అందుతున్నది. నాటి ఆనకట్ట జీవితకాలం పూర్తయినందున దీనిని ఆనుకొని ఎగువ మరికొంత హెచ్చు సామర్థ్యం గల బ్యారేజ్‌ను నిర్మించడం జరిగింది.

పశ్చిమ డెల్టాకు నీరందించుటకు విజ్జేశ్వరం వద్ద ప్రారంభమైన ప్రధాన కాలువ నిడదవోలు సమీపాన శెట్టిపేట వద్ద రెండుగా చీలుతుంది. ఒకటి ఏలూరు కాలువ, రెండవది నరసాపురం కాలువ. ఏలూరు కాలువ నుండి తాడేపల్లి గూడెం సమీపాన గల నవాబుపాలెం వద్ద బ్యాంక్ కెనాల్ చీలి గోదావరిని ఆనుకుని ప్రవహిస్తాయి. వీటి నుండి అనేక ఉప కాల్వలు ద్వారా మొత్తం పశ్చిమ డెల్టా సాగవుతున్నది. కృష్ణానది నుండి వచ్చిన ఏలూరు కాలువ ద్వారా ఏలూరు తాలూకాలోని డెల్టా ప్రాంతం సాగవుతున్నది.

ఈ మొత్తం ఇరిగేషన్ వ్యవస్థ 130 సం.ల క్రితం రూపొందించబడినదే. నాటి నుండి నేటికి పశ్చిమ డెల్టాలో సాగుభూమి, నీటి వినియోగం గణనీయంగా పెరిగాయి. కాని పెరిగిన సాగుభూమికి అనుగుణంగా నీటి పారుదల సౌకర్యాలు అభివృద్ధి చేయబడలేదు. వీటితో పాటు ఎప్పటికప్పుడు తగిన త్రవ్వకాలు, మరమ్మతులు లేకపోవటం వలన, 80 దశకంలో తరచుగా వచ్చిన గోదావరి వరదల వలన చాలా భాగం కాలువ



గట్లు దెబ్బతిన్నాయి. పెరిగిన అవసరాల కనుగుణంగా కాలువలను వెడల్పు చేసి, గట్లు ఎత్తుగాను, బలంగాను వేయాలి. 1964లో గోదావరి వరదలు వచ్చిన సందర్భంగా మిత్రా కమిటీ చేసిన సూచనలు నేటికి పూర్తిగా అమలు జరపలేదు. మొత్తంగా చూసినపుడు పెరిగిన పశ్చిమ డెల్టా అవసరాల కనుగుణగా నీటి పారుదల వ్యవస్థను ఆధునీకరించాలి.

### మెట్ట ప్రాంతంలో నీటి వనరులు

మెట్ట ప్రాంతంలో ప్రధానంగా చెరువులు, బావులు, బోర్‌వెల్స్ ద్వారాను, వర్షాధారంతోను వ్యవసాయం చేస్తున్నారు. ఇటీవలి కాలంలో తమ్మిలేరుపై నాగిరెడ్డిగూడెం వద్ద, ఎర్రకాలువపై కొంగువారిగూడెం వద్ద నిర్మించిన వరద నిరోధక రిజర్వాయర్ల నుండి కొంత వరకు నీరు సాగుభూమికి అందుతున్నది. అయితే వీటి నుండి ఇంకా కాలువలను త్రవ్వవలసి ఉన్నది. ప్రధానంగా బోర్లపైనే ఆధారపడుట వలన భూగర్భ జలాలు తరిగిపోతున్నవి.

### నీటి సౌకర్యం గల భూమి

| | | ఎకరాలలో |
|---|---|---|
| నీటిసాగు క్రిందగల భూమి మొత్తం | - | 13,04,552 |
| నికర నీటి సదుపాయం ఉన్నది | - | 8,99,105 |
| గోదావరి కాలువల క్రింద | - | 5,25,670 |
| కృష్ణకాలువల క్రింద | - | 58,680 |
| వర్షంపై ఆధారపడినది | - | 2,10,395 |
| చెరువులు, కుంటలు క్రింద | - | 1,20,495 |
| నూతులు, బోర్లు, గొట్టపు బావులు | - | 2,79,658 |
| ఎత్తిపోతల పథకాల క్రింద | - | 6,280 |
| ఒక పంటకంటే ఎక్కువ పంటలు పండించే భూమి | - | 4,05,405 |

అనేకమైన బోర్‌వెల్స్‌లోను, బావులలోను నీరు అడుగంటి పోతున్నది. ఇదే పరిస్థితి కొనసాగితే ఈ ప్రాంతపు భూములు బంజర్లుగా మారతాయనే భయాందోళనలు రైతులలో నెలకొన్నాయి. గోదావరి నదిపై పోలవరం ప్రాజెక్టు నిర్మించటం, మెట్ట ప్రాంతం నుండి ప్రవహిస్తున్న వివిధ ఏర్లు వాగులపై చిన్న తరహా ప్రాజెక్టులను నిర్మించటం వలన మెట్ట ప్రాంతానికి విస్తారంగా సాగుభూమికి నీరు అందించుటతోపాటు, భూగర్భ జలాలు తరిగిపోకుండా రక్షించుకోగలము. అంతేగాక డెల్టా ప్రాంతానికి వరద ప్రమాదాన్ని నివారించే అవకాశం కూడా ఉన్నది.

### పోలవరం ప్రాజెక్టు ఆవశ్యకత

గోదావరి నదిలో ప్రవహించే అమూల్యమైన జలాలలో ఇప్పటికి 80% వృధాగా సముద్రంలో కలిసిపోతున్నాయి. 20% జలాలను మాత్రమే గోదావరిపై ఇప్పుడున్న ఆనకట్టల ద్వారా ఉపయోగించుకోగల్గుతున్నాము. ఈ పరిస్థితిలో బహుళార్థసాధకమైన పోలవరం ప్రాజెక్టును నిర్మించుట వలన తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలలోని మెట్ట ప్రాంతాలకు నీరందించుటతోపాటు విశాఖ, విజయనగరం, కృష్ణా, ఖమ్మం జిల్లాలకు ప్రత్యక్షంగా నీరు సరఫరా చేయుటానికి ఉపయోగపడుతుంది. గోదావరి నదిని కృష్ణానదిని అనుసంధానం చేయటం ద్వారా తెలంగాణా, రాయలసీమలలోని విస్తారమైన భూములకు సాగు నీరందించుటకు అవకాశమున్నది. విశాఖ ఉక్కు ఫ్యాక్టరీ అవసరాలకు సరిపడే నీరు ఈ ప్రాజెక్టు వల్లనే లభిస్తుంది. గోదావరి వరదల నివారణకు, జల విద్యుచ్ఛక్తి తయారు చేయుటకు ఈ ప్రాజెక్టు నిర్మాణానికి మొదట శంకుస్థాపన చేసినపుడు 500 కోట్ల రూపాయల నిర్మాణ వ్యయం అవుతుందని అంచనా వేశారు. నేడది రూ. 3,000కోట్లు దాటిపోయింది. కాని నిర్మాణం మాత్రం ప్రారంభం కాలేదు. ఈ ప్రాజెక్టు ప్రాముఖ్యత రీత్యా జాతీయ ప్రాజెక్టుగా గుర్తించి కేంద్ర ప్రభుత్వం నిధులు సమకూర్చాలని రైతు సంఘం, ఈ ప్రాంత ప్రజలు అనేక సంవత్సరాలుగా డిమాండ్ చేస్తున్నారు. రాష్ట్ర ప్రభుత్వం చొరవ తీసుకుని ప్రాజెక్టు నిర్మాణాన్ని ప్రారంభించుటకు కృషి చేయాలి. నాలుగు జిల్లాల రైతాంగం అఖిలపక్ష ఉద్యమం ద్వారా పెద్ద ఎత్తున ఆందోళన చేయాల్సిన అవసరం నేడెంతయినా వుంది.

### రైతాంగాన్ని, ప్రజలను దుఃఖంలో ముంచెత్తుతున్న డ్రైనేజీ వ్యవస్థ

జిల్లాలో డెల్టా ప్రాంతంలో వ్యవసాయం ప్రధానంగా 3 భాగాలుగా ఉన్నది. కొల్లేరు బేసిన్, ఉప్పుటేరు బేసిన్, పశ్చిమ బేసిన్‌గా ఈ మూడు భాగాలు ఉన్నాయి. మెట్ట ప్రాంతం నుండి ప్రవహించే ప్రధాన యేర్లు కొన్ని డెల్టా ప్రాంతంలో డ్రైన్లుగా ఉపయోగపడుతున్నాయి. జిల్లాలో 21 మేజర్ డ్రైన్లు, 52 మధ్య తరహా డ్రైన్లు, 412 చిన్న డ్రైన్లు, 596 ప్రైవేట్ డ్రైన్లు ఉన్నాయి. తమ్మిలేరు, రామిలేరు, గుండేరు, ఎర్రకాల్వ, గోస్తనీ, గొంతేరు, భగ్గేశ్వరం, మొగల్తూరు, బసవ రాజుకోడు, గుండుపూడి సౌత్, రుద్రయ్యకోడు, పందికోడు, యనమదుర్రు, నక్కల, కాజ డ్రైన్లు ముఖ్యమయినవి. వీటిలో మేజర్ డ్రైన్లను అప్పుడప్పుడు మరమ్మతులు చేస్తుండగా మధ్య తరహా, చిన్న డ్రైయిన్‌లకు దాదాపు మరమ్మతులు లేవు. పెరిగిన సాగుభూమి అవసరాల కనుగుణంగా డ్రైన్లను విస్తరించకపోగా ఉన్న డ్రైన్లు మరమ్మతులు లేక పూడిపోవడంతోపాటు ఆక్రమణలకు గురై మురుగు నీరు క్రిందికి పోవటం లేదు. రైతుల నుండి డ్రైనేజి సెస్సు వసూలుచేస్తున్న అవసరమైన నిధులను ఎప్పటికప్పుడు కేటాయించకపోవటం, నిధులను మళ్ళించటం, కేటాయించిన కొద్దిపాటి నిధులనుకూడా కాంట్రాక్టర్లు, అధికారులు కుమ్మక్కై దుర్వినియోగం చేయుట వలన డ్రైయిన్లు పూడిపోయి పశ్చి

### పంటలసాగు వివరాలు

| | | ఎకరాలలో |
|---|---|---|
| వ్యవసాయం చేసే నికర భూమి | - | 11,04,242 |
| వరి (60%) | - | 7,30,612 |
| చెరకు | - | 62,500 |
| ప్రత్తి, పొగాకు, మిరప | - | 95,000 |
| పప్పు, చిరు ధాన్యాలు | - | 62,500 |

# THE MRUTYUNJAYA CO-OPERATIVE RURAL BANK LTD.,

NO. C 2324

*Sri Saragalla Venkata Rama Krishna Rao*
President — Phone No 6257

*Sri Nekkanti Surya Venkata Subba Rao*
Vice-President — Phone No 6293

*Sri Chekuri Umamaheswara Rao*
Secretary — Phone No 6229



BANK: 6227
MILL: 6247
STD: 08814

**ACHANTA-534123**
Achanta Mandal,
West Godavari Dt.(A.P)

## సంగ్రహ చరిత్ర

1917వ సంవత్సరములో ఆచంట గ్రామానికే పరిమితం కాబడి ప్రాథమిక వ్యవసాయ సహకార పరపతి సంఘం రిజిష్టరు కాబడి దినదినాభివృద్ధి చెందుతూ 1956 మార్చి 15వ తేదీన "దిమృత్యుంజయ కో-ఆపరేటివ్ రూరల్ బ్యాంకు లిమిటెడ్, నెం. సి 2324, ఆచంట" పశ్చిమ గోదావరి జిల్లాగా రిజిష్టరు అయినది. దీని వ్యవహారిక విస్తీర్ణము ఆచంట, పెనుమంచిలి, కండవల్లి, చినమల్లం, మినిమించిలిపాడు గ్రామములు కలవు. ప్రారంభము నుండి అత్యధిక మొత్తములో డిపాజిట్లు సేకరించి ప్రస్తుతము **"భారతదేశము"లోనే డిపాజిట్లు సేకరించుటలో ప్రథమ స్థానములో ఉన్నది.**

## 31.3.92 నాటికి బ్యాంకు ప్రగతి నివేదిక

| | | |
|---|---|---|
| 1. ఏ క్లాసు సభ్యులు | 8008 | |
| 2. సభ్యుల వాటా ధనము | 14.87 | (లక్షలలో) |
| 3. రిజర్వుఫండు | 3.84 | " |
| 4. ఇతర రిజర్వులు | 14.98 | " |
| 5. సభ్యులు, ఇతరుల డిపాజిట్లు | 161.75 | " |
| 6. వివిధ అప్పులు సంఘమునకు రావలసినవి. | 169.68 | (లక్షలలో) |
| 7. రైతుల నుండి ధాన్యం కొనుగోలు | 64.71 | " |
| 8. రైతులకు ఎరువులు పురుగుమందుల సరఫరా | 45.42 | " |
| 9. అంచనా లాభం | 3.00 | " |

## చెప్పుకోదగినవి – మెచ్చుకోదగినవి



అ) బంగారు వస్తువులపై రైతుకి రు. 10,000లు అప్పు ఇచ్చుచున్నది.
ఆ) బలహీన వర్గముల వారికి ఎట్టి హామీ లేకుండా రు. 300లు అప్పు ఇచ్చుచున్నది.
ఇ) మార్కెట్టు ధరపై క్వింటాలు ధాన్యమునకు రు. 10లు బోనసు బాకీలు చెల్లించిన వారికిచ్చు చున్నది.
ఈ) సభ్యులకు అనేక సేవలను అందించుచున్నది.
ఉ) ప్రారంభము నుండి లాభములను ఆర్జించుచున్నది.
ఊ) వరుసగా 15 సంవత్సరముల నుండి ఆడిట్‌లో 'ఏ' క్లాసు సంపాదించినది.
ఎ) ఫిల్మ్ డెవలప్‌మెంటు కార్పొరేషను-"సహకారమే సౌభాగ్యం" డాక్యుమెంటరీ చిత్రము ఈ సంఘ ఆవరణలో షూటింగు జరిపి ఆంధ్రప్రదేశ్ అంతటా విడుదల చేసెను.
ఏ) 1987-88 సంవత్సరములో ఆంధ్రప్రదేశ్‌కి ఉత్తమ సహకార సంఘముగా ఎంపిక కాబడి రిజర్వు బ్యాంకు మేనేజరుగారు ఉత్తమ సంఘ పురస్కారము గావించెను.
ఐ) ఆల్ ఇండియా రేడియో విజయవాడ ఈ సంఘ కార్యకలాపముల డాక్యుమెంటరీ ది. 8-12-91వ తేదీన వినిపించెను
ఒ) ఇతర రాష్ట్రముల నుండి పెక్కు మంది ఈ సంఘమును సందర్శించుచుండెను.

## ప్రస్తుత పాలకవర్గము

1. శ్రీ పరగళ్ళ వెంకటరామక్రిష్ణారావు — అధ్యక్షులు
2. శ్రీ నెక్కంటి సూర్యవెంకట సుబ్బారావు — ఉపాధ్యక్షులు
3. శ్రీ బలుసు వీరరాఘవులు — పాలకవర్గ సభ్యులు
4. శ్రీ కానుమిల్లి జోగిరాజు — "
5. శ్రీ వి.ఆర్.కె.మోహనరావు — "
6. శ్రీ గణేశుల అప్పారావు — "
7. శ్రీ బాలం రామారావు — "
8. శ్రీ శీలం గురుమూర్తి — "
9. శ్రీ ఆంద్రు శామ్యూల్ (జిల్లా కేంద్ర సహకార బ్యాంకు డైరెక్టరు) — "
10. శ్రీ చోడగిరి స్వాములు — "
11. శ్రీ బంగారు సత్యం — "

**నామినేటెడ్ పాలకవర్గ సభ్యులు**

1. శ్రీమతి నెక్కంటి బుల్లి రత్నకుమారి
2. శ్రీమతి మొనవర్తి రామలక్ష్మి

సంఘ కార్యదర్శి : శ్రీ చేకూరి ఉమామహేశ్వరరావు
బి.ఏ, బి.ఎస్. డి.సి.ఆర్.ఎస్.,

219

డెల్టా రైతాంగం పాలిట శాపంగా పరిణమించాయి. దీనికితోడు 80వ దశకంలో గోదావరి నదికి వచ్చిన వరదలు, అధిక వర్షాల వలన తీవ్ర ముంపుకు గురై జిల్లాలోని ఇరిగేషన్, డ్రైన్ వ్యవస్థ పూర్తిగా దెబ్బతిన్నది.

డ్రైనేజీ వ్యవస్థను నేటి అవసరాలకు అనుగుణంగా ఆధునీకరించాలని రైతాంగం కోరుతూ వచ్చింది. రైతు సంఘం అనేక సంవత్సరాలుగా ఆందోళన చేస్తున్నది. ప్రస్తుతం ప్రపంచ బ్యాంకు నిధులతో రాష్ట్ర ప్రభుత్వం మేజర్ డ్రైన్లను త్రవ్వుతున్నది. అయితే దీనితో పాటు మధ్య తరహా, చిన్న డ్రైన్లు త్రవ్వటం, మూసుకుపోతున్న సముద్ర ముఖ ద్వారం వద్ద రెగ్యులర్‌గా డ్రెడ్జింగ్ చేయటం, త్రవ్విన తరువాత కూడా డ్రైన్లకు ఎప్పటికపుడు రిపేర్లు చేయటం, సరైన నిర్వహణ జరిగినపుడు ఈ సమస్యకు శాశ్వత పరిష్కారం లభిస్తుంది. మైనరు డ్రైన్లు కూడా వీటితోబాటే త్రవ్వాలి. ఇదిజరగకపోతే గత నష్టాలు నుంచి బయట పడలేము.



**చేపలు, రొయ్యల చెరువుల అభివృద్ధి**

జిల్లాలో దాదాపు దశాబ్దం క్రిందంట కొల్లేరు ప్రాంతంలో చేపల చెరువులు త్రవ్వి చేపలు పెంచటం మొదలయింది. చేపల పెంపకం వలన లభిస్తున్న ఆదాయంతో పాటు, డెల్టా ప్రాంతానికి సమస్యగా పరిణమించిన డ్రైనేజీ ముంపు కూడా చేపట చెరువుల త్రవ్వకానికి దోహదం చేసింది. గత 5,6 సంవత్సరాలుగాచేపల చెరువులు విస్తారంగా త్రవ్వటం జరిగింది. ప్రస్తుం వ్యవసాయ రంగంలో చేపల చెరువులు త్రవ్వి విస్తారంగా చేపలు పెంచటం ఒక ప్రధాన అంశంగామారింది. దీనిపై ఆధారపడి ఐస్ ఫ్యాక్టరీలు, ఫిష్ ప్యాకింగ్, ఫీడ్స్ ఫ్యాక్టరీలు, రవాణా వాహనాలు కూడాఅభివృద్ధి చెందుతున్నాయి. అయితే చేపల పెంపకానికి అవసరమయిన శాస్త్రీయ పద్ధతులు అందరికీ అందుబాటులోకి రాకపోవటం, చేపలకు జబ్బులు వచ్చిన సందర్భాలలో సరైన వైద్య సలహాలు లభించే అవకాశం లేకపోవటం, విపరీతంగా పెరిగిన ఫీడ్స్ దరలు, మార్కెటింగ్ సమస్యలు, అమ్మకం ధరలు స్థిరంగా లేకపోవటం వల్ల రైతాంగం ఇబ్బందులకు లోనవుతున్నారు. ప్రభుత్వం వైపు నుండి కూడా వీరికి సరైన సహకారం లేకపోవటం లోపంగా ఉన్నది. ఈ సమస్యలను పరిష్కరించి రైతులను ప్రోత్సహించే పంటలకు అనువుగా లేని భూములు, పల్లపు ప్రాంతాలుగా ఉండి నిత్యం ముంపుకు గురయ్యే భూములలో చేపల చెరువులను అభివృద్ధి చేయుటకు ఉపయోగపడుతుంది.

గోదావరి నది, ప్రధాన డ్రైన్లు సముద్రంలో కలిసే ప్రాంతంలో లభించే బ్రాకిష్ నీరుపై ఆధారపడి భీమవరం, నరసాపురం దిగువ ప్రాంతంలో విస్తారంగారొయ్య పెంపకం చేపట్టారు. రొయ్యల పెంపకం వలన తక్కువ కాలంలో మంచి ఆదాయం లభించుట వలన తక్కువ కాలంలో మంచి ఆదాయం లభించుట వలన అనేక మంది ఈ రంగంలో ప్రవేశిస్తున్నారు. శాస్త్రీయంగా రొయ్యలను పెంచే పద్ధతి రైతులకి అందుబాటులోకి రాకపోవటం, మేలు రకం సీడ్ లభించకపోవటం, ఫీడ్స్ ధరలు పెరగటం, రొయ్యలకు జబ్బులు వచ్చే సందర్భాలలో వైద్య సలహాలు అందుబాటులో లేకపోవటం, ధరల స్థిరీకరణ లేకపోవటం, విదేశీ, స్వదేశీ ఎగుమతి సంస్థల ధరలు తమకనుకూలంగా నిర్ణయించటం, కోల్డ్ స్టోర్ సౌకర్యాలు అందుబాటులో లేకపోవటం, రవాణా సౌకర్యాలు సరిగా లేకపోవటం, బ్యాంకులు, కో-ఆపరేటివ్ సంస్థల ద్వారా అప్పులు లభించకపోవటం వంటి సమస్యలు ప్రధానంగా ఉన్నాయి. విలువైన విదేశీ మారక ద్రవ్యాన్ని ఆర్జించి పెట్టే రొయ్యల పెంపకాన్ని ప్రోత్సహించుటకు ప్రభుత్వం ఈ సమస్యలను పరిష్కరించవలసి ఉన్నది.

జిల్లాలో సుమారు 60,000 ఎకరాలలో చేపలు, రొయ్యల పెంపకం సాగుతున్నదని అధికారిక అంచనా. ఈ సంవత్సరం యింకా అనేక మంది క్రొత్తగా చెరువులు త్రవ్వటం జరుగుతున్నది. అందువలన కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు పూనుకొని ఈ రంగాలలో ఉన్న సమస్యలు పరిష్కరించి రైతులను ప్రోత్సహించాలి.

జిల్లాలో కొబ్బరి తోటలు, చెట్లు పెంపకం పెరుగుతున్నది. తక్కువ ఖర్చుతో తేలికగా పెంచగల్గినది కొబ్బరి చెట్టు. నికరమైన ఆదాయం లభిస్తున్నది. అందువలన తోటల కంటే ఎక్కువగా చేలగట్లు, కాలువ గట్లు, పుంతలు, చెరువు గట్లు, అవకాశమున్న అన్ని చోట్ల కొబ్బరి చెట్లు పెంచటం జరుగుతున్నది. మొత్తంగా కాకుండా గట్లపై పెంచుట వలన రైతులకు అదనపు ఆదాయం సంపాదించేఅవకాశం కలుగుతున్నది. మంచి రకం కొబ్బరి మొక్కలు అందుబాటులో లేకపోవటం, శాస్త్రీయ పద్ధతులు అనుసరించకపోవటం వలన కేరళలో వలె ఆదాయం పొందలేకపోతున్నారు. ధరలలో కూడా తరచుగా హెచ్చుతగ్గులు ఉంటున్నాయి. ఈ సమస్యలు పరిష్కరిస్తే రైతులకు కొబ్బరి చెట్ల పెంపకం ఎంతో ఉపయోగపడుతుంది.

**గ్రామీణ ప్రాంతంలో వ్యవసాయక పరిస్థితి**

జిల్లాలోని డెల్టా ప్రాంతంలో భూస్వాములు - ధనిక రైతులు తమ భూములను (వరి) స్వంతంగా చేయకుండా కౌలుకు యిచ్చారు. పేద రైతులు - వ్య.కార్మికులు కౌలుదార్లుగా వున్నారు. 25 నుంచి 30 బస్తాల వరకు రెండు పంటలకు కౌలు వుంది. ఈ రకంగా కౌలు దోపిడీ సాగుతోంది. ఇదంతా మూజువాణీ పద్ధతిలోనే జరుగుతున్నాయి.

వ్యవసాయంలో తగిన గిట్టుబాటు లేక రైతుల్లో ఈ రంగంపైన క్రమేణా అసంతృప్తి ఏర్పడుతోంది. ఈ అసంతృప్తి నుంచి విముక్తి చేయడానికి ప్రభుత్వం శ్రద్ధ వహించాల్సి వుంది. తగిన చర్యలు చేపట్టాలి.

# వర్షాకాలపు (సార్వా) పైర్ల సాగులో మెళకువలు

డాక్టర్ యం.వేణుగోపాలరావు
లాంఫాం, గుంటూరు.

వైవిధ్యమైన భూములు మరియు అనుకూలమైన సహజ వనరులు ఉండటం వలన దేశ ఆహార ఉత్పత్తిపై ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర వ్యవసాయాభివృద్ధి కొంత ఆధారపడి వున్నదంటే అతిశయోక్తి కాదు. మన వాతావరణంలో ముఖ్యంగా సార్వా సీజన్లో పండించబడే వివిధ పైర్లలో నూతన సాంకేతిక పరిజ్ఞానాన్ని గమనించి సాగు చేస్తే మంచి దిగుబళ్ళు సాధించి ఆర్థికంగా మెరుగుపడవచ్చనే ఉద్దేశ్యంతో ఈ క్రింది వివరాల్ని క్రోడీకరించి రైతు సోదరుల కందించటమైనది.

## వరి

దాదాపు రాష్ట్రంలో అన్ని జిల్లాల్లోనూ ముఖ్యపంటగా భావించబడుతున్న వరి వివిధ రకాలైన వంగడాలను అందుబాటులోకి తెచ్చుకొని సాగు చెయ్యబడుతున్నది.

**దీర్ఘకాలిక రకములు:** (160-170 రోజులు): క్రొత్తమొలకొలుకులు (యన్.యల్.ఆర్. 9672,9674) పినాకిని, తిక్కన, ప్రతిభ (యం.టి.యు. 5293) బాడవ మసూరి (పిఎల్‌పి 1100 చైతన్య ఎంటియు (2067)

**మధ్యకాలిక రకములు :** (150-160 రోజులు) సాంబ మసూరి (బిపిటి 5204), స్వర్ణ(యంటియు 7029), వజ్రం(యంటియు 5249), మహేంద్ర (ఆర్‌జియల్ 1750), వంశీ (ఆర్.జియల్ 1746), మానస సరోవర్ (ఐయిటి 6314), కృష్ణవేణి (యం.టి.యు.2077), యం.టి.యు.4870 విక్రమార్య మొదలగునవి.

**స్వల్పకాలిక రకములు:** (140 రోజులు కంటే తక్కువ కాల పరిమితి గలవి) తెల్ల హంస, రాశి, పుష్కల, ధాన్యలక్ష్మి, పోతన, ప్రకాష్ సురేఖ, సలీమ్, ప్రభాత్, నాగార్జున, ఫల్గుణ, విక్రమార్క, విజయ మసూరి, సత్య, ఎర్రమల్లెలు మొదలగునవి.

**చిరు సంచుల (Minkit) దశలోని రకములు:**

యం.టి.యు.9992, 9993, పి.యన్.540, సియల్ 39, సి.యం.33, బిపిటి 7338, 7367, డి.యం.29 మొదలగునవి.

**సూచనలు:** 1. అవకాశం వున్న ప్రాంతాల్లో "దంపనారు" పోయటం మంచిది. చేను చదరంగా ఉంటే సూటిగా విత్తనం ద్వారా పైరును పెంచటం కూడా మంచిది (Direct sowing).

2. విత్తనశుద్ధి కిలో విత్తనానికి 2 గ్రా. థైరమ్ లేక 2 గ్రా కార్బండెజిమ్ చేసి సుమారు 5 కిలోల విత్తనాన్ని 40 చ.మీ. విస్తీర్ణంలో చల్లవలెను. పల్చగా మడిలో ఉన్న నారు



నాటటానికి ఉపయోగకరం. హెక్టారుకు 50 కిలోల విత్తనం అవసరం.

3. నారు పీకేందుకు ఒక వారం ముందుగా కార్బోఫ్యురాన్ గుళికలు (సెంటు నారు మడికి 200 గ్రా వంతున) యిసుకలో కలిపి పలుచగా నీరుంచిన మడిలో చల్లాలి.

4. నాటిన 35 రోజుల్లోపల వచ్చే పిలకలే మనకు పయోగకరమని గ్రహించడమైనది. కావున సగటున చ.మీ. 33-40 మొక్కలుండేట్లుగా నాటాలి. దుబ్బు వేగంగా కట్టే స్థితిని కలిగించేందుకు నాటిన 7-10 రోజుల్లోపలే భాస్వరం, పొటాష్ మరియు సగం పాలు నత్రజని ఎరువులు వెయ్యాలి. జింక్ ధాతులోపం రాకుండా జాగ్రత్త పడేందుకు 20-25 కిలోల జింక్ సల్ఫేట్ దమ్ములోనే వేస్తే మంచిది. నత్రజని ఎరువుల అవసరాన్ని గమనించి మాత్రమే వేయాలి. పొలంలో నీరు పల్చగా లేక పూర్తిగా తీసివేసి మాత్రమే నత్రజని-యూరియా, అమ్మోనియం సల్ఫేట్ ఎరువులు వెయ్యాలి.

5. సుడిదెగులు కలిగించే మరియు కాండం తొలిచే (తెల్లకంకి) పురుగుల ఉనికి పెరుగుదలను గమనిస్తూ అవసరమైనప్పుడు కార్బోఫ్యురాన్ గుళికలను ఎకరాకు 12-13 కిలోల వంతున సమంగా చల్లాలి. సాధ్యమైనంత వరకు పిచికారం (Sprays) మందులను మాని వెయ్యాలి.

6. బెంధియోకార్బ్ బ్యుటా క్లోర్, 24 డియి వంటి కలుపు మందులు పైరు నాటబోయేప్పుడు (7-10 రోజుల్లోపల) ఊద మరియు వెడల్పాకుల గడ్డి జాతులున్న ప్రాంతాల్లో వాడవచ్చును.

7. ఎలుకల అదుపుకు ముఖ్యంగా పొలం గట్లను శుభ్రంగా ఉంచడం, కలుగుల్ని గమనించి పొగ యంత్రంతో పొగ పెట్టడం ఎంతో అవసరం. అవసరమైనప్పుడు 0.005 శాతం బ్రోమోడయోలిన్ విషపు ఎరల్ని వాడి ఎలుకల వల్ల కలిగే నష్టం తగ్గించాలి.

## మొక్కజొన్న

**సంకరజాతి (Hybrid) రకాలు** దక్కన్ హైబ్రిడ్ మకా 1,103,105 **అధిక దిగుబడి రకాలు:** అశ్విని, హర్ష, అంబ కాంపోజిట్, మాధురి, గంగా 5, వరుణ్, అంబర్ పాప్ కార్న్ మొదలగునవి.

**సాగుకు సూచనలు:** 1. ఆరుతడి సాగులో హెక్టారుకు 12 కిలోల నత్రజని, 60 కిలోల భాస్వరము మరియు 30 కిలో పొటాష్ ఎరువులు వేయవచ్చును. అదే వర్షాధారపుసాగు 80 కిలోల నత్రజని రెండు దఫాలుగా వెయ్యాలి. భాస్వ మరియు పొటాష్ ఎరువులు ఆఖరి దుక్కిలో పూర్తిగా వెయ్య

అదే విధంగా జింక్‌లోపం గమనించినప్పుడు 0.2% జింక్‌సల్ఫేట్ పిచికారి చేసి స వరించవచ్చును.



2. మొవ్వు చంపేపురుగు 10 శాతంకు మించి గమనించినప్పుడు మాత్రమే ఎండో సల్ఫాన్ వంటి పురుగు మందును సుమారు 1200 మి.లీ హెక్టారుకు పిచికారి చెయ్యాలి. "శనగ పచ్చపురుగు" బెడదగా మారకుండా చూసుకోవాలి. అందుగ్గాను నిఘా కార్యక్రమం చేపట్టాలి. సాధ్యమైనంత వరకు పురుగు మందులు వాడకుండా ఉండాలి.

3. ఆకుమచ్చలేక ఎండాకు తెగుళ్ళ అదుపుకు మాంకోజెబ్ లేక కార్బండెజిమ్ తగు విధంగా వాడాలి.

4. కంకి సమయంలో పక్షుల బారి నుండి రక్షించేందుకు పక్షుల్ని భయపెట్టే "మెరుపు రిబ్బన్స్" వాడడం ఉపయోగకరం.

## జొన్న

**హైబ్రిడ్ రకాలు:** సి.యస్. హెచ్. 1,5,6,9,10,11 మొదలగునవి.

**అధిక దిగుబడి రకాలు:** సి.ఎస్.వి. 10, 11 యస్.పి.వి 462,86 స్వాతి, మోతి (యస్.పి.వి 142) యం.35-1, యన్.టిడి.1, యం.జె.142, యన్.టి.జె.2 మొదలగునవి.

**సూచనలు:** 1 ఎకరాకు సుమారు 72,000 మొక్కలుండేట్లు గా విత్తాలి. హెక్టారుకు 10కిలోల విత్తనాన్ని 45x12 సెం.మీ ఎడంలో విత్తాలి. మూడువారాల్లోపు వొత్తు పీకివెయ్యాలి.



2. జొన్నలో విత్తనశుద్ధి (కిలో విత్తనానికి కి.గ్రా థైరమ్ లేక కాప్టాన్+ 100 గ్రా. కార్బోఫ్యురాన్ మందులు ఎంతో ఉపయోగకరము

3. జొన్న మరియు కందిపైర్లను 2:1 పద్ధతిలో సాగు చేసిన ఉపయోగకరమని తేలినది.

4. 40 కిలోల నత్రజని + 30 కిలోల భాస్వరము + 30 కి.పొటాష్ హెక్టారుకు వేయటం మంచిది.

5. మొవ్వు చంపే ఈగ (Shoot -fly) మరియు కాండముతొల్చే పురుగుల అదుపుకు ఆకుల వొరల్లో ఎండో సల్ఫాన్/ కార్బోఫ్యురాన్ గుళికలు(ఎకరాకు 12 కిలోల వంతున్న) వేయవచ్చును. వీలు కానప్పుడు ఎండో సల్ఫాన్ మందును పిచికారి చేయవచ్చును.

## సజ్జ

మేలైన రకాలు: ఐ.సి.యమ్.హెచ్. 451, డబ్ల్యు.సి.సి.75, ఐ.సి.యమ్.వి. 155, ముక్త, మల్లికార్జున మొదలగునవి.



**సూచనలు:** 1. నూటిగా విత్తేందుకు 4 కిలోల విత్తనం కావాలి. నారు పోసినప్పుడు 1.5-2 కిలోల విత్తనం (సుమారు 150 చ.మీ. విస్తీర్ణంలో) ఎకరాకు సరిపోతుంది. సుమారు 18, 20 రోజుల వయసు నారును నాట వచ్చును.

2. దుక్కిలో హె.కు. 60 కిలోల నత్రజని + 80 కి. భాస్వరము + 30 కిలోల పొటాష్ ఎరువులు వెయ్యాలి.

3. వెర్రి కంకి తెగులు ఈ పైరులో వచ్చే ఒక అతి ముఖ్య బెడద. ఇది కంకిపై గింజలు (పూవులు) బదులుగా పచ్చని ఆకులు లేక ఈనెలు రూపంలో వుండి పనికిరాని కంకిగా మారును. ఇట్టి లక్షణాన్ని గమనించగానే అట్టి మొక్కల్ని పీకి తగలబెట్టాలి. అవసరమైన స్థితిలో మాంకోజెబ్ లేక జడ్ 78 మందును (2 గ్రా. లీటర్ నీటికి) పిచికారి చెయ్యాలి.

4. సజ్జ పైరు పిలకలు వేసే లక్షణం గల పంట కావున యిది రెండు మూడుసార్లు కోతకు వస్తుంది.

5. పక్షుల బారినుండి రక్షించుకొనేందుకు "మెరుపురంగు రిబ్బన్లు వాడటం మంచిది.

## ప్రొద్దు తిరుగుడు

**రకాలు:** ఇసి 68414 మోర్డాన్ కోయంబత్తూర్ 1

హైబ్రిడ్స్ : ఎం.ఎస్.ఎఫ్. హెచ్-1, 8; ఎ.పి.యస్.హెచ్.-11

**సూచనలు:** (1) జూలై రెండవ పక్షంనుండి ఆగస్టు మొదటి పక్షం వరకు వేయవచ్చును. హెక్టారుకు 8-10 (రకాలు) లేక 5-6 (హైబ్రిడ్స్) కిలోల విత్తనం అవసరం. మొలక సరిగా వుండాలంటే ముందుగా నానబెట్టిన విత్తనం విత్తాలి. అంతేగాక విత్తనశుద్ధి (కాప్టాన్ లేక థైరమ్‌తో) ఎంతో అవసరం.

(2) హెక్టారుకు 30 కిలోల నత్రజని + 30కిలోల భాస్వరపు ఎరువులు దుక్కిలో వెయ్యాలి. నల్ల భూముల్లో సుమారు 74,000 మొక్కలుండాలి (అంటే 45x30 సెం.మీ. ఎడంగా విత్తాలి.)

(3) కలుపుమందు - ఫ్లూక్లోరాలిన్ (1.5 కిలోలు/హెక్టారుకు) వాడి మొదటి కలుపు నివారించవచ్చును. కాని 2-4 డి.యి మాత్రం ప్రొద్దు తిరుగుళ్ళో వాడకూడదు.

(4) ప్రొద్దు తిరుగుడు పంటలో మొగ్గ మొదలయ్యే స్థితి, పువ్వు విచ్చుకొనేప్పుడు మరియు గింజ నిండే దశలు ముఖ్యమైనవని గమనించి, ఈ పరిస్థితుల్లో భూమిలో పదును

# రైతుల నేస్తాలు....రేఖా స్ప్రేయర్లు!




## రేఖా పవర్ స్ప్రేయర్

- దృఢమైన ర్యాలి ఎల్–35 ఇంజన్
- స్పాకో కార్బ్యురేటర్
- సేల్స్ తర్వాత నమ్మకమైన సర్వీస్

తయారు చేయువారు

## రేఖా అగ్రిప్లాస్ ప్రైవేట్ లిమిటెడ్

**18–1–3, షాప్ నెం 1. మ్యాంగో మార్కెట్, కేదారేశ్వరపేట.**
**విజయవాడ–520003 ఫోన్: (0866) 73559**

సరైన మోతాదులో వుండేట్లు చూడాలి. అవసరమైతే 2-3 సార్లు తడులు కట్టాలి.



ప్రొద్దు తిరుగుడు

(5) ఈ పైరుపై (వర్షాకాలం) ఎక్కువగా ఆల్టర్‌నేరియా తెగులురావచ్చు. దీని ప్రారంభ దశ కనిపెట్టి మేంకోజెబ్(0.2%) వంటి మందును చల్లాలి. తల పురుగుల్ని గమనించి అవసరమైన స్థితిలో ఎండోసల్ఫాన్ లేక మోనోక్రోటోఫాస్ మందును పిచికారి చెయ్యాలి.

(6) తేనెటీగల ఉనికి తక్కువైనచో గింజ నిండదు. కావున చేతితో రెండు తలల్ని దగ్గరకు చేర్చి రుద్దిన గింజనిండే అవకాశం మెండు. చేతికి గుడ్డతొడుగు కట్టుకొని ప్రొద్దున 11 గం. లోపు ఈ ప్రక్రియ పువ్వులు విచ్చుకొనటం మొదలుబెట్టినప్పటి నుండి సుమారు 10 రోజులు చెయ్యాలి.

**వేరుశనగ**

రకాలు : టి.యం.వి. 2, తిరుపతి 1, 2 జేయల్ 24, ఐ.సి.జి.యస్. 11,44, కదిరి -3, ఐ.సి.జి.ఎస్. 4-10 మొ.వి.

**సూచనలు :** 1. ఆఖరు దుక్కిలో 20 కిలోల నత్రజని + 40 కిలోల భాస్వరం మరియు 50 కిలోల పొటాష్ ఎరువులు (హెక్టారుకు) వెయ్యాలి. భాస్వరాన్ని సింగిల్ సూపర్ ఫాస్ఫేట్ (ఎస్.ఎస్.పి.) రూపంలో వేయటం మంచిది. జింక్ సల్ఫేట్ హెక్టారుకు 25 కిలోల వంతున వేయటం మంచిది.

2. మాంకోజెబ్ లేక థైరమ్‌తో విత్తన శుద్ధి చేయటం ఎంతో ఉపయోగకరం. అదేవిధంగా క్రొత్తగా వేరుశనగ వెయ్యబోయే భూముల్లో రైజోబియం కల్చర్‌ను ఉపయోగించటం మంచిది.

3. హెక్టారుకు 250, 300 కిలోల జిప్సమ్‌ను విత్తిన 30-35 రోజులకు పైరుకు అందేవిధంగా చేయటం చాలా ఉపయోగకరము.

4. మొక్క దశలో ఎక్కువగా వచ్చే యినుపధాతు లోపాన్ని అన్నభేది(ఫెర్రస్ సల్ఫేట్) 0.5% + సిట్రిక్ ఆసిడ్‌లను కలిపి పిచికారి చెయ్యాలి.

5. పొగాకు లద్దె పురుగు, ఆకుముడత పురుగు మరియు ఆకుమచ్చ తెగుళ్ళ అదుపుకు సరైన చర్యలు చేపట్టాలి. మిథైల్ పెరాథియాన్ (0.1%) లేక ఫాస్ఫామిడాన్ (0.05%) లేక క్వినాల్‌ఫాస్(0.1%) వంటి మందును మాంకోజెబ్(0.2%) లేక కార్బండెజిమ్ (0.2%) వంటి వాటితో కలిపి చల్లాలి.

**ఆముదము**

రకములు : అరుణ, భాగ్య, సౌభాగ్య, జివియుసి హెచ్-1 (హైబ్రేడ్).

**సూచనలు:** 1. ఆగస్టు మొదటి పక్షంలోపు వీలున్నంత ముందుగా విత్తటం మంచిది. సరైన దిగుబళ్ళకు మొదటి 100 రోజుల్లో సుమారు 250 నుండి 300 యం.యం. వర్షపాతమున్న ప్రాంతాల్లో ఈ పైరు వేయటం మంచిది. మొలక సరిగ్గా ఉండేందుకు 24 గంటలు ముందుగా నానబెట్టిన విత్తనాన్ని వేయటం ఉపయోగకరము.



2. హెక్టారుకు 40 కిలోల నత్రజని + 40 కిలోల భాస్వరం ఆఖరు దుక్కిలో వేయటం మంచిది. అయితే నీరు కట్టకలిగినప్పుడు మరొక 20కిలోల నత్రజని అవసరమైన స్థితిలో యివ్వాలి.

3. డై మెథోయేట్ (0.07%) లేక మోనోక్రోటోఫాస్ (0.05%) వంటి మందును రసం పీల్చే పురుగుల అదుపుకు, ఎండోసల్ఫాన్ లేక క్వినాల్‌ఫాస్ లేక ఎసిఫేట్ మందును నామాల పురుగు మరియు లద్దె పురుగుల అదుపుకు అవసరాన్ని బట్టి పిచికారి చెయ్యాలి.

ఈ మధ్యకాలంలో ఎక్కువ బెడదగా మారిన గింజ పురుగును గమనించి సరైన సమయంలో మరియు మోతాదులో పురుగు మందు చల్లవలెను. అదేవిధంగా కొన్ని ప్రాంతాల్లో వస్తున్న మొక్క మాడు, వేరుకుళ్ళు, ఆకుమచ్చ తెగుళ్ళు అదేవిధంగా గెల ఎండుబూజు తెగులును గమనిస్తూ అవసరమైనప్పుడు మాంకోజెబ్ (0.2%), కార్బండెజిమ్(0.1%) కవచ్(0.1%) వంటి మందుల్ని వాడాలి.

**ప్రత్తి**

**రకాలు:** యం.సి.యు.5, యల్.ఆర్.ఎ. 5166, కాం. న, యల్.కె. 861 మరియు యల్ 389.

**హైబ్రిడ్స్:** హెచ్ 6 జె.కె.హెచ్.వై - 1 లాం హైబ్రిడ్-1, ఎన్.హెచ్.హెచ్ 44 జయలక్ష్మి లేక డి.పి.హెచ్. - 32.

**సూచనలు**

| | విత్తనం | సాళ్ళమధ్య దూరం | మొక్కలమధ్య దూరం | ఎరువుల మోతాదు |
|---|---|---|---|---|
| సూటిరకం | 6-8 కి. | 105 సెం.మీ. | 60సెం.మీ. | 90న-45భా-45పొ |
| హైబ్రిడ్స్ | 2-2.5కి | 120సెం.మీ. | ,, | 120-60-60 |



పైరుదశలో వేసే ఎరువు ఎప్పుడూ పాదుకి 7-10 సెం.మీ. ఎడంగానూ, లోతుగానూ వేసి మట్టి కప్పాలి. సూటిగా పైన చల్లే (Broadcasting) ఎరువు ఎక్కువ వృధాగా పోతుంది.

2. విత్తనశుద్ధి (20 గ్రా కార్బోఫ్యూరాన్ + 2 మాంకోజెబ్ బోడి చేసిన 1 కిలో విత్తనానికి

# KARSHAK SEEDS

Industrial Estate : : KONDAPALLY
**VIJAYAWADA.** (Krishna Dist)

అధికోత్పత్తి నిచ్చు అన్ని రకముల హైబ్రీడ్ విత్తనములు తయారు చేయు సంస్థ

మావద్ద ప్రత్తి, మిరప, ప్రొద్దుతిరుగుడు మరియు అన్ని రకముల కూరగాయ విత్తనములు (Seed Production) విత్తనోత్పత్తి కొరకు కలవు. ఆసక్తిగల రైతులు సంప్రదించగలరు



అడ్రస్

**Karshak Seeds** I.D.A
**KONDAPALLI, VIJAYAWADA**
**PHONE: 887223**

**NAWAL HYBRID SEEDS**

BIO-TECH& SEEDS
DIVISION EASTERN GENERAL
INDUSTRIES LTD
**18, Brunton Road**
**Off M.G. Road,**
**Bangalore 560 025**

నాణ్యమైన ప్రొద్దు తిరుగుడు
విత్తనముల కొరకు
**NAWAL HYBRID SEEDS**

# EPRO

**BIOTECHNOLOGIES LTD**

**139/B 10th Main**
**Road, RMV Exn.,**
**BANGALORE-560 080**

**CONTACT FOR QUALITY SEEDS OF ALL VARETIES AND FOR PRODUCING EVENING PRIME ROSE SEED**

చేసి నాటినచో ఎంతో ఉపయోగకరము. అదేవిధంగా నాటిన 3-4 వారాలకు హెక్టారుకు 33 కిలోలు చొప్పున కార్బోఫ్యురాన్ గుళికలు వేసిన కొంత వరకు రసం పీల్చే పురుగులు మరియు తల నత్త పురుగు ఉధృతం తగ్గటమే కాకుండా మొక్క పరిసరాల్లోకి ఆకర్షించబడే మిత్రజీవులు రక్షించబడతాయి. అదే పై మందులు (మిథైల్ డెమెటాన్/డై మెథోయేట్స్ ఎక్కువసార్లు చల్లటం వలన పచ్చదోమ పేనుబంక, ముడత పురుగులు పూర్తిగా అంతరించిపోవును. కాని వీటితోపాటు మిత్రజీవులు కూడా నశించిపోవటం వలన, తెల్లదోమ, శనగపచ్చ పురుగులు ఉధృతదశలో రావటానికి అవకాశం కలదు.

3. ముఖ్య పురుగుల యాజమాన్యంలో ముఖ్యభాగమైన నిఘా కార్యక్రమం అమలు చెయ్యాలి. ఎకరాకు సుమారు 4 లింగాకర్షణ బుట్టలు మరియు 2 జిగురు పూసిన పసుపు పచ్చ పళ్ళేలు పైరులో ఉంచిన పురుగుల హెచ్చుతగ్గుల్ని అంచనావేసి, అవసరమైనచో అదుపు చర్యలు చేపట్టవచ్చును.

4. ఎక్కువగా పురుగు మందులను వాడకుండా సాధ్యమైనంత వరకు యితర ప్రక్రియల ద్వారా పురుగుల్ని అదుపు చేసేందుకు ప్రయత్నించాలి. శనగపచ్చ పురుగు/ లద్దె పురుగులపై పనిచేసే యన్.పి.వి. ద్రావణాన్ని చల్లడం, బదానిక పురుగులు తగు సంఖ్యలో వదలటం మంచి పద్ధతులు. అదేవిధంగా వృక్షసంబంధ మందులైన వేపనూనె, పొగాకురసం, నువ్వులనూనె, బెల్లం మొదలగు అవసరాన్ని బట్టి మార్చుకొంటూ వాడాలి.

5. ప్రత్తి పైరులో కొఱ్ఱ, వేరుశనగ, పెసర, సోయాచిక్కుడు వంటివి (1:2) అంతర్పైరులుగా సాగుచేసి శనగ పచ్చ పురుగును వివిధ పురుగుల పోటీ పెంపు వలన అదుపు చెయ్యవచ్చునని గమనించబడినది. అంతేగాక ప్రత్తి సేద్యంలో ముఖ్య సూచనగా కాలుమార్చటం (Crop rotation) అనే దాన్ని ఆచరించే వీలు కూడా ఈ ప్రక్రియ వలన కలుగుతున్నది.

## మిర్చి

**రకాలు :** జి 3, 4 కిరణ్, యల్.సి.ఎ. 235, 206, 960 మరియు 305 (మిని కిట్ దశ)

**సూచనలు :** 1. సుమారు 2.5 కిలోల గింజలు 175 చ.మీ. విస్తీర్ణపు నారుమడిలో చల్లిన విత్తనాన్ని ఒక హెక్టారు పొలములో నాటవచ్చును. వర్షాధారపు పైరును 56x15 సెం.మీ. అదే ఆరు తడి పైరును 60x60 సెం.మీ. విస్తీర్ణంలో నాటవలెను. హెక్టారుకు 1.25 లక్షల మొక్కలుండునట్లుగా నాటిన మంచిదని తెలిసినది. జూలై ఆఖరు వారం నుండి ఆగస్టు మొదటి పక్షం వరకు ఎత్తుటకు లేక నారు పోయుటకు అనుకూలమైన సమయము. 45-50 రోజుల వయసున్న నారును నాటేందుకు వాడాలి. సాధ్యమైనంత వరకు మబ్బుగా వున్న టైంలో నాటితే పడి మొక్కలు తక్కువుంటాయి.

2. వర్షాధారం పంటకు హెక్టారుకు 60 కిలోల నత్రజని 40కిలోల భాస్వరము మరియు 50 కి పొటాష్‌ఎరువుల్ని దుక్కిలో వెయ్యాలి. అవసరాన్ని బట్టి నత్రజని మొక్కల వేళ్ళకు దగ్గరగా పడేట్లు సుమారు 25 కిలోలు అంతరసేద్య పద్ధతి ద్వారా వేయవచ్చును. నీటివనరుపై సాగు చేసినప్పుడు హె.కు 150-160 కిలోల నత్రజని వరకు వేయవచ్చును.

3. రసం పీల్చే -త్రిప్స్ (పై ముడత), మైట్స్ (క్రింద ముడత) మరియు పేనుబంక పురుగుల అదుపుకు మిథైల్ డెమోటాన్, డై మిథోయేట్, మోనో క్రోటోఫాస్, ఫసలోన్, ఎసిఫేట్, ఫాస్ఫామిడాన్, మాంకోజెబ్, కెల్తేన్, కేరాథేన్ వంటి మందులు మార్చి మార్చి వాడాలి.



4. కొమ్మ కుళ్ళు ఆకుమచ్చ తెగుళ్ళ అదుపుకు కాపర్ ఆక్సీక్లోరైడ్ (బ్లూకాపర్ లేక బ్లైటాక్స్) మాంకోజెబ్, టాప్సిన్, కార్బెండిజమ్, కాప్టాన్, కవజి వంటి తెగుళ్ళ మందులను మార్చుకొంటూ వాడాలి.

5. పండిన కాయల్ని ఎక్కువ కాలం చెట్టుపైనే ఉంచకుండా కోతకోసి సరైన పద్ధతుల్లో ఎండబెట్టి కాయ నాణ్యతను బట్టి వేరు వేరుగా నిల్వ చెయ్యాలి. పండు కాయను 2.5 శాతం పొటాషియం కార్బనేట్ ద్రావణంలో కనుక 10 నిమిషములు ముంచి ఆరబెడితే మంచి రంగు నిలబడుతున్నట్లు అర్థమైనది.

గత పంటకాలంలో మిర్చి పైరుపై ఎక్కువ స్థాయిలో వచ్చి నష్టపరచిన వైరస్ తెగుళ్ళి దృష్టిలో ఉంచుకొని ఈ క్రింది ప్రక్రియలు చేపట్టాలి.

1. వైరస్ తెగుళ్ళను కొంత వరకు తట్టుకోగలిగిన జి 4, యల్.సి.ఎ. 235 మరియు యల్.సి.ఎ. 305, ఐ.హెచ్.ఆర్. 990, 328 మొదలగు వంగడాన్ని ఎన్నుకోవాలి. అదనంగా విత్తనాన్ని 15 ని.లు ట్రైసోడియం ఫాస్ఫేట్ (30గ్రా. ఒక లీటర్ నీటిలో) ద్రావణంలో నానబెట్టి నారుమడిలో చల్లాలి.

2. వైరస్ తెగుళ్ళి వ్యాపింపచేసే పేనుబంక పురుగును అదుపు చెయ్యాలి. దీనికై సుమారు హెక్టారు నారుమడిలో 45 కిలోల ఫ్యూరడాన్ (కార్బోఫ్యురాన్) గుళిక మందును నారుపోసేటప్పుడు వెయ్యవలెను. అవసరమైతే పై మందులు కూడా వాడాలి.

3. మినరల్ ఆయిల్ 2 శాతం ద్రావణాన్ని నాటిన తరువాత 2-3 సార్లు పిచికారి చేస్తే కొంత వరకు ఈ వైరస్‌ను అదుపులో ఉంచవచ్చును.

4. వీటితోపాటు నారుమడి మరియు నాటిన మిర్చి చేల చుట్టూ జొన్న, మొక్కజొన్న, నువ్వు వంటి పైర్లను 3 లేక 4 వరసల్లో వేసి ఈ వైరస్ ప్రాకించే పురుగుల వలసను అరికట్టాలి.

5. విధిగా మిర్చి పైరును కూడా యితర పైర్లతో సమానంగా కాలుమార్చే పైరుగా వెయ్యాలి. అంతే గాని సంవత్సరం తరువాత సంవత్సరం ఒకే పైరు అదే భూమిలో వెయ్యటం

(10వ పేజీ తరువాయి)

భూములు కోల్పోయి వ్యవసాయ కూలీలుగా మారుతున్నారు. వ్యవసాయ రంగం ఎదుర్కొంటున్న సంక్షోభానికి ఇంతకన్నా నిదర్శనమక్కరలేదు. గత 45 సంవత్సరాలుగా పాలకులు అనుసరిస్తున్న పెట్టుబడిదారీ, భూస్వామ్య అనుకూల విధానాల ఫలితమే ఇది. అందువలనే ఎన్ని నినాదాలిచ్చినా ఆచరణలో భూమి కేంద్రీకరణలో పెద్ద మార్పు రాలేదు. ఈ క్రింది పట్టికను పరిశీలిద్దాము.

| సం॥ | 10 ఎకరాలలోపు కలిగిన | | 10-25ఎ.మధ్య | | 25ఎ.పైన | |
|---|---|---|---|---|---|---|
| | కమతాల శాతం | చేతిలోవున్న భూమి శాతం | కమతాల శాతం | భూమి శాతం | కమతాల శాతం | భూమి శాతం |
| 1970-71 | 83 | 38.5 | 13 | 30.8 | 4 | 30.7 |
| 1985-86 | 90 | 55.8 | 8 | 27.2 | 2 | 17.0 |

(రాష్ట్ర ప్రభుత్వ నివేదిక (92-93) ఆధారంగా)

జమిందారీ వ్యతిరేకత, కౌలుదారీరక్షణ, భూసంస్కరణల వంటి ఎన్నో చట్టాలు వచ్చినప్పటికీ నేటికీ ఈ భూకేంద్రీకరణ పై విధంగా కొనసాగుతున్నదంటే పాలకుల విధానాలు సులభంగానే అర్థం అవుతాయి. గ్రామీణ దారిద్ర్యానికి తద్వారా ఆర్థిక వెనుకబాటు తనానికి, సంక్షోభాలకు ఇదే మూల కారణం.

1973లో భూసంస్కరణల చట్టం చేసినప్పటికీ దానిలో వున్న లొసుగుల్ని ఆసరా చేసుకొని భూస్వాములు భూములను బదలాయించుకోగలిగారు. అంతే కాకుండా నేటికీ 7 లక్షల ఎకరాలకుపైగా కోర్టుల ద్వారా పెండింగులో వుంది. 1978 నాటికి రాష్ట్రంలో దాదాపు 13 లక్షల ఎకరాల మిగులు భూమి వుండగా క్రమంగా అది 7 లక్షల ఎకరాలకు పడిపోయింది. 4 లక్షల 38 వేల ఎకరాలు పంచినట్లుగా ప్రభుత్వం ప్రకటించింది. పట్టాలు పొంది భూమి స్వాధీనం కాని పేదలు కోకొల్లలుగా వున్నారు. బంజరు, అడవి, చెరువులోతట్టు భూములు సాగు చేసుకుంటున్న పేద రైతులకు పట్టాలివ్వకుండా ప్రభుత్వం ఇబ్బంది పెడుతున్నది. ఆచరణలో భూసంస్కరణలు ఫార్సుగా మారాయి. స్వాతంత్ర్యానంతర కాలంలో భూ సంస్కరణల అమలులో ప్రగతి లేదని స్వయంగా ప్రధాని పేర్కొన్న విషయం గమనార్హం.

అలాగే మన రాష్ట్రంలో 3 1/2 లక్షల ఎకరాల దేవాలయ భూములున్నాయి. 50 వేల మంది కౌలు రైతులున్నారు. వీరికి ఈ భూమిపై ఎలాంటి హక్కులూ లేవు. ప్రభుత్వం వీటిని వేలం వేసి అమ్మాలని ప్రయత్నించగా మన సంఘం ఆధ్వర్యాన ప్రతిఘటించి నిలబెట్టగలిగాము. రాష్ట్రంలో పేరుకు కౌలుదారీ చట్టమున్నా ఆచరణలో అది ఎందుకూ కొరగాకుండా వుంది. ఏ కౌలురైతు కూడా రికార్డుల్లో నమోదు కావడం లేదు. అందువలన వీరు తీవ్రమైన దోపిడీకి గురౌతున్నారు.

రైతుకు తన భూమిని గురించిన హక్కు వివరాలు, తెలిపే 'రికార్డ్ ఆఫ్ రైట్స్' చట్టం తేబడినా ఇంతవరకూ పాస్ పుస్తకాలు జారీ చేయలేదు. ఇది లేనందున అన్ని విధాలా పేద, మధ్య తరగతి రైతులు వేధింపులకు గురౌతున్నారు.

గ్రామీణ రుణ భారం నానాటికి పెరుగుచున్నది. నేషనల్ ఫ్రంట్ హయాంలో రు. 10 వేల వరకు మాఫీ చేయడం వలనే బ్యాంకింగు వ్యవస్థ దెబ్బతిన్నదని దుష్ప్రచారం సాగుతున్నది. కేవలం తాను సంక్షోభం నుండి బైటపడేందుకే గత సంవత్సరం వ్యవసాయ రంగానికి రుణాల నివ్వకుండా ప్రభుత్వం స్తంభింపజేసింది. ఈ సంవత్సరం ఖరీఫ్‌లో మన రాష్ట్రంలో రు. 350 కోట్లు ఇవ్వాలని నిర్ణయించగా రు. 300 కోట్లు మాత్రమే ఇచ్చారు. రైతాంగానికి అవసరమైన రుణాల్లో 3వ వంతు మాత్రమే సహకార, వాణిజ్య బ్యాంకులు సమకూరుస్తున్నాయి. ఇందులో కూడా పేద రైతులకు దక్కేది చాలా స్వల్ప భాగమే.

ఈ సంవత్సరం కోళ్ళ పరిశ్రమ బాగా దెబ్బతిన్నది. రాష్ట్రంలో పాల ఉత్పత్తి గణనీయంగా పెరిగింది. గతంలో గృహావసరాల కోసమే ఉప వృత్తిగా వుండే పాడిపరిశ్రమ నేడు అనేక కుటుంబాలకు జీవనాధారంగా మారింది. రాష్ట్రంలో ప్రతిరోజు సగటున లక్షలలీటర్ల పాలు పడుతున్నారు. సహకార సంఘాల్లో వున్న అవినీతి అసమర్థత వల్ల కోట్ల రూపాయలు దుర్వినియోగం కాబడి ఆ భారం రైతులపైనా, వినియోగదారులపైనా నెడుతున్నారు. కొన్ని జిల్లాలలో మల్బరీ తోటల పెంపకం విస్తరిస్తున్నది. కోస్తా తీరంలో చేపలు, రొయ్యల చెరువులు విస్తారంగా వెలుస్తున్నాయి. ఎకరాకు రు. 15 నుండి 20 వేల వరకు పెట్టుబడి అవుతున్నది. ఆహార, వాణిజ్య పంటలు, పౌల్ట్రీ, పాలు, పట్టు, రొయ్యలు అన్ని కూడా ఈ రోజు మార్కెట్ తీరుతెన్నులపై ఆధారపడి వున్నవి. సరైన మార్కెట్ సౌకర్యాలు లేనందున రైతులు తీవ్రమైన దోపిడీకి గురౌతున్నారు. రాష్ట్రంలో 232 వ్యవసాయ మార్కెట్లు, 817 ప్రకటిత మార్కెట్లు వున్నాయి. తెలంగాణా ప్రాంతంలో వున్న పెద్ద పెద్ద మార్కెట్‌లలో రైతుల మోసాలకు గురౌతున్నారు. వారికి కనీస సౌకర్యాలు లేవు. గోదాములు లేవు. వున్నచోట కూడా వినియోగంలో లేవు. కూరగాయలు వగైరా నిల్వ వుంచుకోను, ఎగుమతి చేసుకోను అవసరమైన కోల్డ్ స్టోరేజి సౌకర్యాలు లేవు. రాష్ట్రంలో పండ్ల ఉత్పత్తి గణనీయంగా వున్నా ఫుడ్ ప్రాసెసింగ్ యూనిట్లు తగినన్ని లేవు. కోస్తా జిల్లాలలో మార్కెట్ యార్డులు నామమాత్రంగానే వున్నాయి. కోట్ల రూపాయలు రుసుంగా వసూలు చేస్తున్నప్పటికీ (90-91లో 55 కోట్లు) రైతు తమ ఉత్పత్తిని న్యాయమైన ధరకు అమ్ముకోవడానికి ఇవి సహకరించడం లేదు.

ఈ విధంగా ప్రభుత్వ భూస్వామ్య, పెట్టుబడిదారీ వర్గ అనుకూల విధానాలు రైతాంగాన్ని నిలువు దోపిడికి గురి చేస్తున్నాయి.

గ్రామీణ ప్రజానీకాన్ని తమ గుప్పెట్లో పెట్టుకోడానికి పాలకులు అనేక అక్రమ, అప్రజాస్వామిక విధానాలకు పాల్పడుతున్నారు. రైతాంగాన్ని గ్రూపుల పేరుతో ముఠాలుగా నిలువునా చీలుస్తున్నారు. వారి మధ్య తగాదాలు పోషించి శాంతి భద్రతల సమస్యలు సృష్టించి శాశ్వతంగా వారు చీలిపోవడానికి భూస్వామ్య వర్గాలు నిరంతరం ప్రయత్నిస్తున్నాయి. రాష్ట్రంలోని కొన్ని ప్రాంతాలలో నక్సలైట్లు ఆయుధాలు చేపట్టి పేదలపై దౌ[illegible]లు సాగిస్తున్నారు. అరాచక ఉద్యమాలు చేపడుతున్నారు. పేద ప్రజల ఉద్యమాలను చీల్చడానికి పాలకులు వీరిని పావులుగా వాడుకుంటున్నారు. మరో వైపున నక్సలైట్ల అరాచకాలను ఎదుర్కొనే పేరిట పోలీసుల దాడులు విచ్చలవిడిగా సాగుతున్నాయి. నల్గొండ జిల్లాలోని కొన్ని గ్రామాల్లో ఇరువురూ కలసి ప్రజాతంత్ర ఉద్యమంపై దాడులు సాగిస్తున్నారు.

రాష్ట్రంలో హరిజనులు, గిరిజనులు, మహిళలు వంటి బలహీన వర్గాలకు రక్షణ లేదు. చుండూరు హరిజనులపై సాగిన మారణకాండ సభ్య ప్రపంచానికే సిగ్గుచేటు. ఇలాంటి సందర్భాలలో రైతాంగ ఉద్యమం బలహీన వర్గాల పక్షాన నిలబడి భూస్వామ్య ఆగడాలను నివారించాలి. పేద రైతులు భూస్వాముల ప్రయోజనాలకు బలి పశువులుగా మారకుండా ఆపాలి. హరిజనులకు రక్షణగా రైతాంగాన్ని నిలబెట్టడం ద్వారా హరిజనులను ప్రజాతంత్ర ఉద్యమం నుండి వేరు చేయడానికి కుతంత్రాలు పన్నే కుల శక్తుల కుట్రలను వమ్ము చేయగలం. చైతన్య వంతమైన రైతు ఉద్యమం మాత్రమే ఈ విధంగా చేయగలదు.

ఇటీవల రాష్ట్ర సహకార సంఘాలకు ఎన్నికలు జరిగాయి. ఈ సందర్భంగా రాష్ట్ర ప్రభుత్వం పెద్ద ఎత్తున అప్రజాస్వామిక చర్యలకు పాల్పడింది. ప్రతి సహకార సంఘానికి ఇద్దరు మహిళల్ని రాష్ట్ర ప్రభుత్వం నామినేట్ చేసే నిబంధన మెజారిటీని తల్లక్రిందులు చేసింది. అనేక సొసైటీలలో 6 సీట్లు (11గాను) సంపాదించుకున్న వర్గం ఈ నామినేషన్ వల్ల మైనారిటీగా మారిపోయింది. ప్రధానంగా ఇది ప్రతి పక్షాలను దెబ్బతీసేందుకు ఉద్దేశించిందే. గతంలో ప్రత్యక్ష పద్ధతిలో ఎన్నికలు జరగ్గా ఈసారి పరోక్ష ఎన్నికలు నిర్వహించడం వలన అధికారం, డబ్బు ప్రధాన పాత్ర వహించాయి. తాము గెలవమనుకున్నచోట మంత్రి స్వయంగా 'స్టే' ఇచ్చి ఎన్నికలు నిలిపేశారు. మరికొన్ని చోట్ల అధికారుల సహాయంతో ఓటర్ల లిస్టులు తారుమారు చేసి గెలవగలిగారు.

పార్లమెంటు, అసెంబ్లీ ఉప ఎన్నికల సందర్భంగా (91 నవంబర్) రాష్ట్రంలో పెద్ద ఎత్తున రిగ్గింగ్, హింసాకాండ చెలరేగాయి. పోలీసులు అధికార పక్షానికి వత్తాసుగా నిలిచారు. ప్రధాని పోటీ చేసిన నంద్యాల నియోజక వర్గంలో ఎన్నికలు బూటకంగా మారాయి.

రాష్ట్రంలో ఎన్నికైన మున్సిపాలిటీలను, కార్పొరేషన్లను రద్దుచేసి, వారి స్థానంలో ప్రత్యేకాధికారులను నియమించారు. జిల్లా, మండల, ప్రజా పరిషత్‌లను కూడా అలాగే రద్దు చేయాలని ప్రయత్నించగా కోర్టు అడ్డుకొని వాటి కాల పరిమితిని మరో నెల పొడిగించింది. కేసు నడుస్తుండగా ప్రభుత్వం ఆర్డినెన్సు తీసుకురావడాన్ని హైకోర్టు తప్పుపట్టింది. తుది తీర్పు ఇంకా రావలసి వుంది. ఈ విధంగా తన అధికారాన్ని నిలబెట్టుకునేందుకు రాష్ట్ర ప్రభుత్వం, కాంగ్రెసు పార్టీ పూర్తి అప్రజాస్వామికంగా వ్యవహరిస్తున్నాయి. ముఖ్యమంత్రితో సహా మంత్రులు, అధికార పార్టీ శాసనసభ్యులనేక మంది అవినీతి ఊబిలో ఇరుక్కున్నారు. ముఖ్యమంత్రి తన స్వంత కుమారునికి పరోక్షంగా గ్రానైట్లను అప్పగించాడు. ఎ.ఐ.సి.సి. ప్లీనరీ సమావేశాల సందర్భంగా అధికార దుర్వినియోగం పెద్ద ఎత్తున సాగింది.

మొత్తం మీద రాష్ట్రంలో పరిస్థితి అస్తవ్యస్థంగా వున్నది. రాబోయే కాలంలో దానికి వ్యతిరేకంగా ప్రజలను ముఖ్యంగా రైతాంగాన్ని పెద్ద ఎత్తున కదిలించాలి. ఇందుకు మన రైతు సంఘం తన శక్తి యుక్తులను పెంచుకోవాలి. ఇందుకోసం ఇప్పటి వరకు మనం చేసిన కృషిని సమీక్షించుకొని భవిష్యత్ కర్తవ్యాలను రూపొందించు కొనవలసి వున్నది.

# గిట్టుబాటు ధరల కోసం పత్తి, పొగాకు రైతుల ఆందోళన

ఈ సంవత్సరం మన రాష్ట్రంలో పత్తి, పొగాకు రైతాంగం సంక్షోభాన్ని ఎదుర్కొంటున్నది.

దేశంలో పండే వర్జీనియా పొగాకులో 85 శాతం మనరాష్ట్రంలోనే పండుచున్నది. అందులోనూ ప్రత్యేకించి ప్రకాశం, నెల్లూరు, గుంటూరు, కృష్ణా, ఖమ్మం, తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, కరీంనగర్ జిల్లాలు ప్రధానమైనవి. ఈ సంవత్సరం దిగుబడి పెరిగిందన్న పేరుతో ఎగుమతి ఆర్డర్లు దాని కనుగుణంగా



ఒంగోలు రైల్వేస్టేషన్‌లో ప్రత్తి, పొగాకు రైతులు 'రైల్‌రోకో' నిర్వహిస్తున్న దృశ్యం

లేవని వ్యాపారస్తులు ప్రచారం సాగిస్తూ ఒక పథకం ప్రకారం ధరలు తగ్గిస్తూ వచ్చారు. గత సంవత్సరం సగటు ధర కేజీకి రు.33-50పైలు రాగా ఈ సంవత్సరం మొదటి రకం (ఎఫ్-1)పొగాకు కూడా సగటు ధర రు.27-28లకు మించి రాలేదు.

దీనిపై రైతాంగంలో పెద్ద ఎత్తున ఆందోళన బయలు దేరింది. ఏప్రిల్ 13వ తేదీన ఒంగోలులో సదస్సు జరపగా పెద్ద ఎత్తున తరలివచ్చారు. ఆసదస్సుకు ఆంధ్రప్రదేశ్ రైతుసంఘం తరపున శ్రీభీమిరెడ్డి నరసింహారెడ్డి (ఎం.పి.) వి. శ్రీనివాసరావు, పార్లమెంట్ సభ్యులు శ్రీయుతులు వడ్డే శోభనాద్రీశ్వరరావు, దగ్గుపాటి వెంకటేశ్వరరావు, యలమంచలి శివాజీ, ధర్మభిక్షం (సి.పి.ఐ) శాసనసభ్యులు కరణం బలరామమూర్తి, మండలాధ్యక్షుడు చుండూరు రంగారావు, పొగాకు ఉత్పత్తి దారుల సమాఖ్య అధ్యక్షులు చుంచు శేషయ్య, ఇంకా పలువురు స్థానిక, జిల్లా నాయకులు హాజరైనారు. ఆసదస్సులో జరిగిన నిర్ణయం ప్రకారం ఏప్రిల్ 16వ తేదీన రాస్తారోకో జయప్రదంగా జరిగింది. 19వ తేదీన ఒక ప్రతినిధి వర్గం ముఖ్యమంత్రిని కలిసి మెమోరాండం సమర్పించి ఎస్.టి.సి.ని వెంటనే రంగంలోకి దించాలని డిమాండ్ చేసింది. అన్ని ప్లాట్ ఫారమ్స్‌ను రైతులు బహిష్కరించి 20వ తేదీనుండి 30వరకు గుంటూరు పొగాకు బోర్డు కార్యాలయాన్ని ముట్టడించారు. అక్కడే భోజనవసతి సమకూర్చబడింది. రాష్ట్ర రైతు సంఘం నాయకులు శ్రీ కొరటాల సత్యనారాయణ, శ్రీపుతుంబాక వెంకటపతి తదితరులు శిబిరాన్ని సందర్శించారు. పలుదఫాలు చర్చలు జరిగాయి. ఆఖరికి ఒక ఒప్పందం కుదిరింది. దాని ప్రకారం ఎస్.టి.సి. వెంటనే రంగంలోకి వస్తుందని, ఎఫ్.-1 కనీసధర రు. 31-00లు సగటు ధర రు. 32.50పై వుండేటట్లు చూస్తామని వ్రాసి ఇచ్చారు. మే 2వ తేదీనుండి కొనుగోళ్ళు ప్రారంభమైనాయి.

కాని ఒప్పందం ఆచరణలో అమలు జరగలేదు. వ్యాపారస్తులు దానికి తూట్లు పొడిచారు. తిరిగి అసెంబ్లీ స్పీకర్ శ్రీ శ్రీపాదరావు నాయకత్వాన అన్ని పార్టీల పార్లమెంట్ సభ్యులతో కూడిన ప్రతినిధి బృందం ఢిల్లీలో ప్రధానిని కలిసి విజ్ఞప్తి చేయగా ఆయన హామీ ఇచ్చారు. కాని ఆచరణలో ఆ హామీకి అదేగతి పట్టింది. మే ఆఖరుకు ధరలు దారుణంగా పడిపోసాగాయి. రైతాంగం మరోసారి గళం విప్పి వీధుల్లోకి రావాల్సివచ్చింది. అఖిల పక్ష కార్యాచరణ కమిటీ ఆధ్వర్యాన జూన్ 3వ తేదీన ఒంగోలు, అమ్మనబ్రోలు, కావలి, పెదకాకానిలలో రైల్‌రోకో చేశారు. అయినా పాలకులు కళ్ళు తెరవలేదు. రైతాంగాన్ని వంచించారు.

## ప్రత్తి

మన రాష్ట్రంలో గుంటూరు, ప్రకాశం, వరంగల్, ఆదిలాబాద్ జిల్లాలలో ప్రధానంగా ప్రత్తి పండిస్తారు. దేశంలో ఈ సంవత్సరం ప్రత్తి ఉత్పత్తిపెరిగినప్పటికీ, మిల్లు యజమానులు తప్పుడు లెక్కలు చెప్పి పత్తి వాలదని, దిగుమతి చేసుకోవాలని కోరగా ప్రభుత్వం అంగీకరించింది. దీనితో మన రాష్ట్రంలో పత్తి ధరలు పడిపోవడమే గాక ఆఖరికి కొనే దిక్కులేకుండా పోయింది. ముఖ్యంగా గుంటూరు, ప్రకాశం జిల్లాలలో పరిస్థితి తీవ్రంగా వుంది. అప్పుల వాళ్ళు కట్టమని, బ్యాంకుల వాళ్ళు జప్తు చేస్తామని వెంటబడుతుంటే రైతాంగం పరిస్థితి దయనీయంగా మారింది.

దీనిపై రైతు సంఘం చొరవ తీసుకుని మార్చి 18వ తేదీన గుంటూరు సి.సి.ఐ. ఆఫీసు వద్దకు ఒక రాయబారం నడిపి వెంటనే రంగంలోకి దిగాలని కోరింది. మాకు ఆర్డరు వున్నంత వరకు కొన్నామని ఇకకొనలేమని చెప్పారు. కాని వాస్తవానికి అది బ్రోకర్ల వద్దనుండే కొన్నారని రైతులు అన్యాయమవుతున్నారని చెప్పినా సి.సి.ఐ.కి గోడు విన్పించలేదు. ఏప్రిల్ 18న అఖిలపక్ష



కమిటీ ఆధ్వర్యాన ఇంకొల్లులో 4వేల మందితో సదస్సు జరిగింది. మే 18న ఇదే కమిటీ ఆధ్వర్యంలో గుంటూరు సి.సి.ఐ. ఆఫీసు వద్ద మరోసారి వేలాది మందితో ధర్నా జరిగింది. పార్లమెంట్ సభ్యులు శ్రీమోటూరు హనుమంతరావు, డా॥దగ్గుపాటి వెంకటేశ్వరరావు, యలమంచిలి శివాజీ, పుతుంబాక వెంకటపతి, శ్రీమతి భారతి, వల్లూరి గంగాధరరావు తదితరులు పాల్గొన్నారు. అనంతరం జరిగిన కమిటీ సమావేశంలో 26వ తేదీన యడ్లపాడు వస్తున్న ముఖ్యమంత్రికి విజ్ఞాపన పత్రం సమర్పించాలని నిర్ణయించారు. ఆమేరకు రైతులు తెల్లవారే సరికి యడ్లపాడు స్పిన్నింగ్ మిల్లు వద్దకు ట్రాక్టర్లు, లారీలపై తరలి వచ్చారు. అఖిల పక్ష కమిటీ తరఫున శ్రీయుతులు బోడేపూడి వెంకటేశ్వరరావు, వి. శ్రీనివాసరావు నాగబోయిన రంగారావు, పోపూరి రామారావు, యలమంచిలి శివాజీ, వల్లూరి గంగాధరరావు తదితరులు మెమోరాండం ఇచ్చి సమస్యను వివరించబోగా ముఖ్యమంత్రి నాకేం బాధ్యతలేదు. ఇది కేంద్రం వ్యవహారం మీ పార్లమెంట్ సభ్యులు అక్కడ మాట్లాడకుండా ఇక్కడ ఆందోళన చేయిస్తున్నారంటూ చిందులు త్రొక్కడం ప్రారంభించారు. ఆ తర్వాత వేలాదిగా తరలి వచ్చిన రైతులు కూడా నిరసన తెలుపుతుండగా, ఉపన్యాసం మధ్యలోనే ఆపేసి ముఖ్యమంత్రి చరచరా హెలిపాడ్ వద్దకు వెళ్ళిపోయాడు. అక్కడ కూడా కొద్ది పాటి వాదోపవాదాలు జరిగాయి. ఆ తర్వాత జరిగిన రైతుల సభలో నాయకులు ప్రసంగిస్తూ ముఖ్యమంత్రి ధోరణికి నిరసన తెలిపారు. ఇదే విధంగా మంగళగిరిలో కూడా రైతులు తమ డిమాండ్లు నెరవేర్చాలని కోరారు. ఆ తర్వాత ముఖ్యమంత్రి ఒక ప్రటకన చేస్తూ తాను ప్రత్తి రైతుల సమస్య పరిష్కారానికి కృషి చేస్తున్నానని సి.సి.ఐ.ని రంగంలోకి తెచ్చేందుకు, ప్రత్తి ఎగుమతుల కోసం ప్రయత్నిస్తున్నామని కేంద్రంతో. చర్చిస్తున్నానని ప్రకటించాడు.కాలయాపన తప్ప సమస్య పరిష్కారం కాకపోవడంతో గత్యంతరం లేని పరిస్థితులలో రైతాంగం అఖిల పక్ష కార్యచరణ కమిటీ ఆధ్వర్యంలో జూన్ 17,18 తేదీలలో సి.సి.ఐ. వద్ద వందలాది మంది పికెటింగ్ నిర్వహించారు. అంతిమంగా సి.సి.ఐ. మార్కెట్‌లో ప్రవేశించడానికి అంగీకరించింది. సి.సి.ఐ. గత చరిత్ర చూసినపుడు ఈ వాగ్దానాన్ని అమలు జరిపించుకోడానికి రైతులు చైతన్యంతో కృషి చేయాల్సిన అవసరం వుంది.

# వివిధ జిల్లాల వ్యవసాయ రంగ పరిస్థితులు

## కృష్ణాజిల్లా

కృష్ణాజిల్లా 37వ రైతు మహాసభ ఏప్రిల్ 28, 29 తేదీలలో హనుమాన్‌జంక్షన్ మాకినేని బసవపున్నయ్యనగర్‌లో ఉత్సాహపూరితంగా జరిగింది. జిల్లా నలుమూలల నుండి 36 వేల సభ్యత్వానికి ప్రాతినిధ్యం వహిస్తూ 135 మంది ప్రతినిధులు హాజరయ్యారు. మహాసభ 28 ఉదయం సీనియర్ రైతు నాయకులు శ్రీఅట్లూరి శ్రీమన్నారాయణ పతాకావిష్కరణతో ప్రారంభమయ్యింది. మహాసభకు శ్రీనూరవనేని విజయసారధిరావు, శ్రీ ఎం. నాగభూషణరెడ్డి, శ్రీఎన్.సుబ్రమణ్యం, శ్రీమతి కె.స్వరూపరాణిగారలు అధ్యక్షవర్గంగా వ్యవహరించారు. ఆహ్వానసంఘాధ్యక్షులు


ఎస్.విజయసారధిరావు
జిల్లాఅధ్యక్షులు


వై.కేశవరావు
జిల్లా కార్యదర్శి

శ్రీఎన్.వి.ఎస్.శర్మ ప్రతినిధులకు స్వాగతం పలికారు. రాష్ట్ర రైతు సంఘ సహాయ కార్యదర్శి శ్రీపి.మధు ప్రారంభోపన్యాసం చేస్తూ కేంద్ర ప్రభుత్వం అనుసరిస్తున్న ఆర్థిక విధానాలు వ్యవసాయ రంగంపై ఏ ప్రభావం కలుగచేసేది పేర్కొని, రైతు సంఘ కర్తవ్యాలను వివరించారు. గత మహాసభ అనంతరం జరిగిన కార్యకలాపాల సమగ్రమైన నివేదికను కార్యదర్శి ప్రవేశపెడుతూ ఈ క్రింది అంశాలు పేర్కొన్నారు.

గత మహాసభ అనంతరం జిల్లా రైతాంగం ఎదుర్కొంటున్న వివిధ సమస్యలన్నింటా మన సంఘం కృషి సాగించింది. కేంద్ర ప్రభుత్వం ఎరువుల ధర పెంపుదల సందర్భంగా 32 కేంద్రాలలో ఎరువులు బ్లాక్ మార్కెట్‌కు తరలకుండా ఆందోళన చేయటంతోపాటు లక్ష బస్తాలు కంట్రోలు ధరలకు అమ్మించటంలో మన సంఘం మంచి కృషి చేసింది. కేంద్రం ధర పెంచటానికి వారం రోజుల ముందుగానే మైలవరంలో అక్రమంగా నిల్వచేసిన గొడౌన్ల వద్ద రైతాంగాన్ని సమీకరించి ధర్నాలు నిర్వహించి 2 వేల బస్తాలు పైగా కంట్రోల్ ధరలకు అమ్మించటం జరిగింది. రాష్ట్రంలోనే మొదటి చర్యగా యిది ఉద్యమానికి మంచి ఊపునిచ్చింది.

గత మహాసభ నాటికి మన చొరవతో అఖిలపక్షకార్యాచరణ కమిటీ ఏర్పడి జిల్లాలో కొల్లేరు బేసిన్‌లోని బుడమేరు తదితర డ్రైన్ల ముంపు నివారణకు శాశ్వత చర్యల కోసం సుదీర్ఘమైన ఆందోళన సాగించాము. ఫలితంగానేడు అనేక పనులు ప్రపంచబ్యాంక్ నిధులతో జరుగుతున్నాయి. పనులు జరిగే సందర్భంగా మన సంఘం దళాలుగా పర్యటించి ఎప్పటికప్పుడు అధికారులతో చర్చించటం, ఆయా సందర్భాలను బట్టి సదస్సులు జరపటం, ఆందోళనలు సాగించటం కొనసాగిస్తూ వచ్చింది.

1991లో గల్ఫ్ యుద్ధం కారణంగా ఆయిల్ కొరతతో మామిడి ఎగుమతికి లారీలు దొరకని పరిస్థితి ఏర్పడటం, వ్యాపారులు మామిడి తోటలు కొనటానికి ముందుకు రాకపోవటంతో మన సంఘం చొరవ తీసుకుంది. విస్సన్నపేటలో మామిడి రైతుల సదస్సు నిర్వహించాము. సదస్సులో అన్ని రైతు సంఘాలు, రాజకీయ పార్టీలు పాల్గొన్నాయి. రైల్వే అధికారులను కలుసుకొని పరిస్థితి వివరించగా రైల్వే అధికారులు వెంటనే స్పందించి అధికారులు, వ్యాపారులు, రైతుల త్రైపాక్షిక సమావేశం జరిపి, మామిడి ఎగుమతికి అవసరమైన వ్యాగన్‌లు సరఫరాకు అంగీకరించారు. ఈమధ్య కాలమంతా చెరకు, పొగాకు, తదితర పంటల గిట్టుబాటు ధరల కోసం అఖిలపక్ష సదస్సులు నిర్వహించటంతోపాటు మన సంఘం స్వతంత్రంగా కరపత్రాలు వేయటం ప్రచారం నిర్వహించటం వంటి కార్యక్రమాలు చేపట్టింది.

అటవీబంజర్లకు చెట్టుపట్టాలు కొరకు, సముద్రతీర బంజర్లు పేదలకు పంచాలని వ్యవసాయ కార్మిక సంఘాలతో కలిసి సదస్సులు ఆందోళనలు నిర్వహించాము. సాగర్ జలాల సమస్యలపై ఎప్పటికప్పుడు ఎక్కడికక్కడ అధికారులతో మాస్ డిప్యుటేషన్‌లు చేయటం సమస్యలను పరిష్కారానికి [illegible] చేయటం జరుగుతుంది. వీటితోపాటు అఖిలభారత, రాష్ట్ర సంఘాలు యిచ్చిన పిలుపులన్నింటికి స్పందించి జిల్లా నలుమూలలలో ఆ కార్యక్రమాలను జయప్రదం గావించాము. 1990లో 31 వేల సభ్యత్వం, 91లో 31668 సభ్యత్వం 92లో 36వేల సభ్యత్వం చేరింది. పెరిగిన కార్యకలాపాలకు ఉద్యమపలుకుబడికి తగిన విధంగా సంఘ నిర్మాణ అభివృద్ధి చెందలేదని, సంఘసభ్యత్వం మన బలానికి అనుగుణంగా పెరగటం లేదని, నిర్మాణాన్ని అభివృద్ధి పరచుకోవాలని, రైతువాణి పత్రికను విరివిగా చేర్పించాలని నివేదిక సూచించింది. ఆ నివేదికపై 2[illegible] మంది చర్చలలో పాల్గొన్నారు.

రెండవ రోజు ఉదయం ప్రతినిధులు, ఆహ్వానితుల ప్రత్యేక సదస్సు జరిగింది. ఆ సదస్సులో రాష్ట్ర రైతు సంఘ కార్యదర్శి శ్రీకొరటాల సత్యనారాయణ, సహాయ కార్యదర్శి శ్రీవి. శ్రీనివాసరావు, కృష్ణాజిల్లా రైతు సంఘం (హైదరాబాద్) కార్యదర్శి శ్రీసూర్యదేవర నాగేశ్వరరావు, కృష్ణాజిల్లా తెలుగురైతు అధ్యక్షులు శ్రీమూల్పూరు బాలకృష్ణారావులు తమ సందేశాలు యిచ్చారు. సదస్సుకు ప్రతినిధులతోపాటు 200 మంది రైతులు హాజరయ్యారు.

మహాసభలో రాష్ట్ర ప్రభుత్వం సాగర్‌కాలువల నిర్మాణానికి అవసరమైన నిధులు కేటాయించాలని, జిల్లాలోని చెరువులన్నింటి సాగర్ సర్కిల్ పరిధిలో చేర్చి, వాటినన్నిటిని అభివృద్ధిపరచి సాగర్‌కాలువలతో లింకు ఏర్పరచి, నీటితో నింపాలని, జిల్లాలో ఎత్తిపోతల పథకాలకు రిపేర్లు చేపట్టాలని, మైనర్ ఇరిగేషన్, డ్రైన్ కాలువల మరమ్మతులకు అవసరమైన నిధులు యివ్వాలని, పులిచింతల రిజర్వాయర్ నిర్మాణం చేపట్టాలని, [illegible]

ఆంధ్రప్రదేశ్ రైతు సంఘ 14వ రాష్ట్ర మహాసభలు
జయప్రదంగా ముగిసిన సందర్భంగా శుభాకాంక్షలు

## రైతు శ్రేయస్సే మా ధ్యేయం

# నెం. 1293. కంతేరు ప్రాథమిక వ్యవసాయ సహకార పరపతి సంఘం (లి) కంతేరు.

తాడికొండ మండలం, గుంటూరుజిల్లా.

### సంఘ వ్యాపార విస్తీర్ణం, కంతేరు

| | |
|---|---|
| సంఘ సభ్యులు | : 2600 |
| సంఘ సభ్యుల షేరుధనం | : రూ.2,50,000=00 |
| సభ్యుల డిపాజిట్స్ | : రూ.10,00,000=00 |
| పరపతేతర వ్యాపారం | : ఎరువులు, పురుగుమందులు |
| టర్నోవర్ | : రూ.10,00,000=00 |
| సంఘమునకు స్వంత భవనం కలదు. విలువ | : రూ.2,00,000=00 |
| సభ్యుల యొక్క అప్పులు | : రు.30,00,000=00 |



### సంఘపాలకవర్గముః

1. శ్రీ నంద్యాల వెంకటేశ్వరరెడ్డి, ప్రెసిడెంటు
2. శ్రీ బుల్లా భిక్షాలు, వైస్ ప్రెసిడెంట్
3. శ్రీ గాలి గోపిరెడ్డి డైరెక్టర్లు
4. శ్రీ కందుల వెంకటేశ్వర్లు "
5. శ్రీ బొమ్మారెడ్డి వెంకటరెడ్డి "
6. శ్రీ మల్లూరి రామ్మోహనరావు "
7. శ్రీ తోకల నాగయ్య "
8. శ్రీ సూదా వెంకటేశ్వర్లు "
9. శ్రీ కొండా సాంబిరెడ్డి "
10. శ్రీ అనుమర్లపూడి వెంకటేశ్వర్లు "
11. శ్రీ గుర్రంకొండ యిర్మియా "
12. శ్రీమతి కొర్రపాటిసూర్యబ్రహ్మం "
13. శ్రీమతి మండేపూడి సరోజిని "

**శ్రీ నంద్యాల వెంకటేశ్వరరెడ్డి**
ప్రెసిడెంటు

**శ్రీ దాది రంగారావు**
కార్యదర్శి

A.10

వసూళ్ళు నిలుపుచేయాలని, అక్రమంగా విధించిన పెనాల్టీలు రద్దు చేయాలని కోరుతూ తీర్మానాలు చేసింది. మహాసభ ముగింపు సందర్భంగా ప్రదర్శన, బహిరంగసభ జరిగాయి. జిల్లాలో రైతాంగం ఎదుర్కొంటున్న అన్ని సమస్యలను సమగ్రంగా మహాసభ చర్చించిందని పత్రికలన్నీ ప్రశంసించాయి. మహాసభ 37 మందితో కార్యవర్గాన్ని ఎన్నుకుంది. అధ్యక్ష కార్యదర్శులుగా శ్రీసూరపనేని విజయసారధి, కార్యదర్శిగా శ్రీవై.కేశవరావు ఎన్నికైనారు. భూములకు చెట్టు పట్టాలు యివ్వాలని, సముద్రతీర బంజర్లను పేదలకు యివ్వాలనీ, వ్యవసాయపు విద్యుచ్ఛక్తి సొతస్లాబ్ పద్ధతినే కొనసాగించాలని, శిస్తుల నిర్బంధ

వసూళ్ళు నిలుపుచేయాలని, అక్రమంగా విధించిన పెనాల్టీలు రద్దు చేయాలని కోరుతూ తీర్మానాలు చేసింది. మహాసభ ముగింపు సందర్భంగా ప్రదర్శన, బహిరంగసభ జరిగాయి. జిల్లాలో రైతాంగం ఎదుర్కొంటున్న అన్ని సమస్యలను సమగ్రంగా మహాసభ చర్చించిందని పత్రికలన్నీ ప్రశంసించాయి. మహాసభ 37 మందితో కార్యవర్గాన్ని ఎన్నుకుంది. అధ్యక్ష కార్యదర్శులుగా శ్రీసూరపనేని విజయసారధి, కార్యదర్శిగా శ్రీవై.కేశవరావు ఎన్నికైనారు.

## కర్నూలు


టి. మద్దులు
జిల్ల అధ్యక్షులు


టి.నర్సింహయ్య
జిల్లా కార్యదర్శి

జిల్లాలో సగభాగం నల్లరేగడి, మరొక సగం కొండగుట్టలతో కూడిన ఎర్రనేలలు, కె.సి.కెనాల్, తుంగభద్ర దిగువకాలువల ద్వారాను, గాజులదిన్నె ప్రాజెక్టు ద్వారాను సుమారు 3 లక్షల ఎకరాలకు సాగు నీరు లభిస్తుంది. మిగిలిన ప్రాంతం. వర్షం పై ఆదారపడ్డది. వర్షపాతం తక్కువై కొన్ని ప్రాంతాలు తరుచుగా కరువుకు గురవుతువుంటాయి. కె.సి.కెనాల్, తుంగభద్ర దిగువ కాలువ కూడా తుంగభద్ర నదిపై ఆధారపడినవే గనుక నదిలో నీరు తక్కువై తరుచుగా కె.సి.కెనాల్ ఆయకట్టుకు రెండవ పంటకు నీరందటం లేదు. చెరుకు పండించే ప్రాంతంలో నీరందక చెరకు పండక చక్కెర ఫ్యాక్టరీ మూలపడింది. దిగువ కాలువ పై ప్రాంతం(కర్నాటక)లో తరుచుగా తెగిపోవటం, అక్రమ నీటి వినియోగం వల్ల, మన వాటా నీరు సక్రమంగా వదలనందువల్ల మొదటి పంటకు కూడా తరచుగా నీరందటంలేదు. అందుచే కె.సి.కెనాల్ ఆయకట్టు స్థిరీకరణకై అలగనూరు బ్యాలెన్సింగ్ రిజర్వాయర్ సుంకేసుల బ్యారేజి నిర్మాణాలకు 1989లో శంకుస్థాపన జరిగింది. కాని తరువాత రాష్ట్రంలో కాంగ్రెస్ ప్రభుత్వం నిర్లక్ష్యం వల్ల తగిన నిధులు కేటాయించక, నిర్మాణ పనులు చేపట్టలేదు. శ్రీశైలం ప్రాజెక్టు కుడి కాలువ, తెలుగుగంగ నిర్మాణాలు నత్తనడక నడుస్తున్నాయి. గాలేరు-నగరి సుజలస్రవంతి, హంద్రీనీవా పథకం ప్రతిపాదన దశలోనే వున్నాయి. అందుచే ప్రాజెక్టుల నిర్మాణం ప్రధాన సమస్య. మా జిల్లా రైతుసంఘం యీ సమస్యకు ప్రాధాన్యతనిచ్చి ప్రదర్శనలు, సదస్సులు జరిపి ఆందోళన సాగిస్తూంది.

శ్రీశైలం ప్రాజెక్టు కుడికాలువ, తెలుగుగంగ, వెలుగోడు బ్యాలెన్సింగ్ రిజర్వాయర్లలో ఆత్మకూరు తాలూకాలో సుమారు 35 వేల ఎకరాల భూమి- అందులో 16 వేల ఎకరాల ప్రస్తుత మాగాణి భూమి మునిగిపోయింది. కాని 4 వేల ఎకరాలను మాత్రమే క్రొత్త ఆయకట్టులో చేర్చటం జరిగింది. పైగా కుడికాలువ లోయ త్రవ్వకం వల్ల చుట్టుప్రక్కల గ్రామాలలోని బావులలో నీరింకిపోయి, బావుల క్రింద సాగు నష్టపడింది. అందు చేత ఆ తాలూకాకు ప్రత్యామ్నాయంగా 5 లిఫ్ట్ యిరిగేషన్ పథకాలు సూచించి, సదస్సులు రాయబారాలు జరిపి ఆందోళన చేయటం జరిగింది. ఫలితంగా 2 పథకాలు ఆమోదించబడినాయి. 16 వేల ఎకరాలకు నీరందే అవకాశం ఏర్పడింది.

శ్రీశైలం ప్రాజెక్టు రిజర్వాయర్‌లో 5 మండలాలకు చెందిన 54 గ్రామాలలో సుమారు 50 వేల ఎకరాల భూమి, 10 వేల ఇండ్లు మునిగిపోయాయి. 16 సంవత్సరాలు దాటినా వాటికి తగిన నష్టపరిహారం అందలేదు. మార్కెట్ రేట్ ప్రకారం నష్టపరిహారానికై కోర్టులో 23 వేల కేసులు వేయగా 12 వేల కేసులు పరిష్కారమైనప్పటికీ నష్టపరిహారం చెల్లించలేదు. యింకా అనేక వేల కేసులు కోర్టుకెళ్ళలేదు. యీ సమస్యపై 1989లో 2000 మందితో మునక గ్రామాల రైతు సదస్సు జరపటం, 1500 మందితో ఆనాటి ముఖ్యమంత్రి వద్దకు రాయబారం వెళ్లటం జరిగింది. ఆయన సానుభూతితో కోర్టులో పరిష్కారమైన కేసులకు 89 ఆఖరులోగా చెల్లిస్తామని వాగ్దానం చేయటం జరిగింది. కాని తర్వాత వచ్చిన కాంగ్రెస్ ముఖ్యమంత్రులు ఆ వాగ్దానం అమలు జరపనందువల్ల 5 మండల కేంద్రాలలో సుమారు 1300 మందితో ధర్నాలు నిర్వహించడం ఫలితంగా లోక్‌అదాలత్ ఏర్పడడం జరిగింది. అయితే లోక్‌అదాలత్ సూచించిన రేట్లు రైతాంగానికి సంతృప్తికరంగా లేనందున ముఖ్యమంత్రి వద్దకు సామూహిక రాయబారం వెళ్లటం జరిగింది. ఇటీవల ఉప ఎన్నికల్లో కేంద్ర, రాష్ట్ర మంత్రులు, ప్రధాన మంత్రి సైతం త్వరలో చెల్లిస్తామని వాగ్దానం చేసినప్పటికీ అతీగతీ లేదు. అందుచే యీ సమస్యపై మళ్ళీ ఆందోళనకు

## కొమరబండ ప్రాథమిక వ్యవసాయ సహకార పరపతి సంఘం(లి.) రి. నెం. హెచ్ 872

### కొమరబండ

### పాలకవర్గం

1. శ్రీ మహంకాళి సీతారామచంద్రశేఖరశాస్త్రి, అధ్యక్షులు
2. శ్రీ నంపెట శీతయ్య ఉపాధ్యక్షులు
3. శ్రీ పయిడిమర్రి ముత్తయ్య డైరెక్టర్లు
4. శ్రీ వనువులేటి వెంకటేశ్వర్లు ,,
5. శ్రీ మహ్మద్ జమీరుద్దీన్ ,,
6. శ్రీ మైనేని శ్రీరాములు ,,
7. శ్రీ చట్టు లక్ష్మయ్య ,,
8. శ్రీ దేవపంగు చినశంబయ్య ,,
9. శ్రీ తమలపాకుల నర్సయ్య ,,
10. శ్రీ మద్దెల అబ్రహం ,,
11. శ్రీ షేక్ నబిసాహెబ్ ,,
12. శ్రీమతి మామిడి వెంకట్రాములమ్మ ,,
13. శ్రీమతి కూరపాటి విజయకుమారి ,,

కార్యదర్శి: కొల్లి వీరయ్య మరియు సిబ్బంది

## ప్రాథమిక వ్యవసాయ సహకార పరపతి సంఘం

రిజిష్టర్ నెం. హెచ్. 1084, కాగిత రామచంద్రాపురం, నడిగూడెంమండలం, నల్లగొండ జిల్లా

### పాలకవర్గం

1. శ్రీ పాలడుగు మాధవరావు ప్రెసిడెంట్
2. శ్రీ మేకల వెంకటేశ్వర్లు వైస్ ప్రెసిడెంట్
3. శ్రీ అల్లుపల్లి వీరారెడ్డి డైరెక్టర్లు
4. శ్రీ ఎల్లిరెడ్డి వెంకట్రామిరెడ్డి ,,
5. శ్రీ మొగిలి పుల్లయ్య ,,
6. శ్రీ రణబోతు వెంకటరెడ్డి ,,
7. శ్రీ చింతకుంట్ల రెడ్డి ,,
8. శ్రీ కైగూరి లింగయ్య ,,
9. శ్రీ కలికొండ ముత్తయ్య ,,
10. శ్రీ కలికొండ రామస్వామి ,,
11. శ్రీ దనియాకుల సైదయ్య ,,
12. అల్లుపల్లి రుక్కమ్మ ,,
13. శ్రీమతి గుజ్జర్లపూడి పద్మ

కార్యదర్శులు: రావిళ్ళ నాగేశ్వరరావు, నీలకంఠం సైదులు మరియు సిబ్బంది

## తాడువాయి ప్రాథమికవ్యవసాయ సహకార పరపతి సంఘం

### మునగాల మండలం, నల్లగొండజిల్లా

### పాలకవర్గం

1. శ్రీ ఆరె పిచ్చిరెడ్డి అధ్యక్షులు
2. శ్రీ దొంతగాని వెంకట నర్సయ్య డైరెక్టర్లు
3. శ్రీ బోడా జాను ,,
4. శ్రీ నర్రా వెంకటరెడ్డి ,,
5. శ్రీ యలక నారాయణరెడ్డి ,,
6. శ్రీమతి నాగార్జునవు వరమ్మ ,,
7. శ్రీమతి దారా జ్ఞానమ్మ ,,
8. శ్రీ కొలిశెట్టి వెంకటేశ్వర్లు ,,
9. శ్రీ యలగందుల పాపయ్య ,,
10. శ్రీ గొట్టు వెంకట్రామయ్య ,,
11. శ్రీ జిల్లెపల్లి నర్సయ్య ,,
12. శ్రీ జిల్లెపల్లి లింగయ్య ,,

రచ్చా భద్రకాళి, కార్యదర్శిమరియు సిబ్బంది

## కొక్కిరేణి ప్రాథమికవ్యవసాయ సహకార పరపతి సంఘం

మునగాల మండలం, నల్లగొండజిల్లా

### పాలకవర్గం

1. శ్రీ సారెడ్డి లింగారెడ్డి అధ్యక్షులు
2. శ్రీ పోటు పుల్లయ్య ఉపాధ్యక్షులు
3. శ్రీ తిమ్మారెడ్డి కోటిరెడ్డి డైరెక్టర్
4. శ్రీ మెదరమెట్ల వెంకటేశ్వరరావు ,,
5. శ్రీ తిమ్మారెడ్డి జీవన్‌రెడ్డి ,,
6. శ్రీ తుమ్మల వెంకటేశ్వర్లు ,,
7. శ్రీ రువ్వా శ్రవణకుమార్ ,,
8. శ్రీ ముల్కలపల్లి రాములు ,,
9. శ్రీ దాసరి కోటిలింగం ,,
10. శ్రీ మెడం భిక్కయ్య ,,
11. శ్రీ పచ్చిపాల కనకయ్య ,,
12. శ్రీమతి తిమ్మారెడ్డి ఈశ్వరమ్మ ,,
13. శ్రీమతి పొన్నం జయమ్మ ,,

షేక్ యక్‌బాల్, కార్యదర్శి మరియు సిబ్బంది

మన రైతు సంఘం ఆధ్వర్యంలో కృషి ప్రారంభమైంది.

జిల్లాలో వేరుశనగ ప్రధాన వ్యాపారపంట. పత్తి, పొగాకు సూర్యకాంతి, టమోటా కూడా పండిస్తారు. జొన్న, వరి ధాన్యాలు కూడా పండుతాయి. కర్నూలు, నంద్యాల, ఆదోని పట్టణాలలో వ్యవసాయ మార్కెటు (Regulated markets). అయితే ధరలు, తూకాలు, డబ్బు చెల్లించి, వడ్డీలు మొదలైన విషయాల్లో రైతాంగం వివిధ రకాల దోపిడీకి గురవుతుంది. యీ సమస్యపై మన సంఘం యిప్పుడిప్పుడే ఆందోళన ప్రారంభించింది.

అదే విధంగా గిట్టుబాటు ధరల కొరకు, ఎరువుల ధరల తగ్గింపు కొరకు, పెంచిన నీటితీరువా విద్యుచ్ఛక్తి ఛార్జీల పెంపుదలకు వ్యతిరేకంగా 10 వేల రూ.లలోపు అప్పుల రద్దు కొరకు, పరపతి సౌకర్యాలు కొరకు, దేవాలయ భూమిలకు కౌలుదారీ చట్టం వర్తింపుకొరకు


ఎ.లక్ష్మీనారాయణ
జిల్లాఅధ్యక్షులు


బొంతల చంద్రారెడ్డి
జిల్లా కార్యదర్శి

కేంద్ర,రాష్ట్ర కమిటీలు యిచ్చిన పిలుపులన్నింటినీ అమలు జరపడం జరిగింది

అనావృష్టి సందర్భాలలో కరువు సహాయ చర్యల కొరకు, శాశ్వత కరువు నివారణా పథకాల కొరకు ఆందోళనలు చేయడం జరుగుతుంది.

## నల్లగొండ

జిల్లా సగటు వర్షపాతం 718 మిల్లిమీటర్లు. జిల్లాలో 25,58,056 ఎకరాలు సేద్యానికి యోగ్యమైన భూమి ఉన్నది. ఇందులో నాగర్జున సాగర్ ఆయకట్టు 2,75,000 ఎకరాలు, ఆసిఫ్‌నహర్ మూసిప్రాజెక్టు, పెండ్లిపాకల, భీమనపల్లి, గాంధీనగర్, ఎడవల్లి, డిండి, వేములూరు ఇతర చిన్న నీటి వనరుల వల్ల 50 వేల ఎకరాలు సేద్యం అవుతుంది. కరెంటు ద్వారా బావుల క్రింద 4 లక్షల ఎకరాలు సేద్యం అవుతుంది. జిల్లాలో 1,14,581 బావులు కరెంటు సౌకర్యం కలిగి ఉన్నవి. యింకా 20 వేల దరఖాస్తులు మంజూరు కొరకు పెండింగ్‌లో ఉన్నవి. రైతులు డబ్బులు చెల్లించలేక యిబ్బందిపడుతూ ప్రభుత్వ వత్తిడులకు గురౌతున్నారు. జిల్లాలో శాశ్వత జలవనరుల ఆయకట్టు కంటే కరెంటు సౌకర్యం ద్వారానే ఎక్కువ భూమి సేద్యం జరుగుతున్నది. మిగితాది ప్రకృతిపై

జిల్లా రైతాంగం ప్రకృతి మీద ఆధారపడి గ్యారంటీలేని ఏకవార్షిక పంటలను వదులుకొని పండ్లతోటల పెంపకంవైపు నెమ్మదిగా మారుతున్నారు. యిప్పటికి కొన్ని వేల ఎకరాల పండ్లతోటలు వేయటం జరిగిది. యింకా వేసే అవకాశాలు చాలా ఉన్నట్లు తెలియుచున్నది. జిల్లాలో వరిపంట ప్రధానమైన పంటగా నిలిచింది. భూగర్భ జల వనరులు తగ్గటం వలన ఇది కూడా దెబ్బతిని ప్రతి బావి క్రింద మూడవ భాగం పంట ఎండిపోయినది. రాష్ట్రంలో ప్రత్తి పండించటంలో నల్లగొండ జిల్లా రెండవ స్థానం చేరుకొన్నది. ప్రత్తిపంటలు తెగుళ్ళతో దెబ్బతినటం వల్ల వేల రూపాయల పెట్టుబడులు పెట్టినా పంటల దిగుబడి తగ్గినది. ప్రత్తిధర ఒకేసారి క్వింటాలుకు 15 వందల నుండి వెయ్యి రూపాయలకు పడిపోవటం వల్ల రైతులు బాగా దెబ్బతిన్నారు. మిర్చి పంటవైపు గతంకంటే మొగ్గు చూపుతున్నారు. వేరుశనగ పంటను వర్షాధారంగా ఆరుతడి క్రింద ముఖ్యమైన పంటగా పండించుచున్నారు. ఆముదం పంటను వర్షాధారం క్రింద ప్రధానమైన వాణిజ్య పంటగా కొనసాగుచున్నది. నల్లభూములలో వేసే పొగాకు పంట కనుమరుగయినది. గిట్టుబాటు కాని సజ్జ, జొన్నలాంటి పైర్లు కూడా వేయటం కనుమరుగు అగుచున్నవి. చెరుకు పండించే రైతులకు సరియైన విత్తన సప్లై లేక దీనికి తోడు ఫ్యాక్టరీ, మిషనరీ లోపం వలన చెరకు పంట దిగుబడి తగ్గటంతో పాటు నాణ్యత తగ్గటం వలన గిట్టుబాటు రేటురాక చెరుకు రైతులు నష్టపోయారు. దీనికితోడు ఈ సంవత్సరం కాలువల మరమ్మతుల పేరుతో నీరు ఆపుచేయటం, ప్రత్యామ్నాయ నీటి వనరులు ఏర్పాటు లేక అసలు ఉన్న ఫ్యాక్టరీనే లేఆఫ్ చేశారు. దీనికి పరిష్కారమార్గం మన రైతు సంఘం సూచించింది. ఫ్యాక్టరీకి సమీపంలో వున్న మూసీనదికి లిఫ్టులు ఏర్పాటు చేయటం చెరకు పంట పొలాల్లో బోర్లు ఏర్పాటు చేయటం లాంటివి సూచించినప్పటికీ ఎలాంటి చర్యలు తీసుకోబడలేదు.

### కర్తవ్యాలు

జిల్లాను శాశ్వతంగా కరువు నుండి విముక్తి చేయుటకు శ్రీశైలం ఎడమగట్టు కాలువ మరియు శ్రీరాంసాగర్ రెండవ దశ, ఎగువ వరద కాలువలు సాధించుటకు రైతాంగ పోరాటాలు నిర్వహించాలి.

2. మూసీనదిపై ఉన్న రాచ కాలువలు మరమ్మత్తు చేయించి చిన్న నీటి వనరులు పెంపొందించుటకు పోరాటం సాగించాలి.

3.సాగర్ ఆయకట్టు క్రింద కాలువ చివరి భూములు (టేలండ్) 40 శాతం భూములకు నీరందక బీడు పడి ఉన్నవి. వీటికి డైవర్షన్ కాలువల ద్వారా నీరందించుటకు మరియు సాగర్ ఎడమ కాలువపై సహకార ఎత్తిపోతల పథకాలకు అసంపూర్తిగా ఉన్నవాటిని పూర్తి చేయుటకు,

## తెల్లబెల్లి ప్రాథమిక వ్యవసాయ సహకార పరపతి సంఘం

నడిగూడెం మండలం :: నల్గొండ జిల్లా

| | |
|---|---|
| 1. శ్రీ కొల్లు మోహన్‌రావు | అధ్యక్షులు |
| 2. శ్రీ వంగవీటి శేఖర్ | ఉపాధ్యక్షులు |
| 3. శ్రీ కొల్లు పెద్ద కోటేశ్వరరావు | డైరక్టరు |
| 4. శ్రీ గుండపనేని అంజయ్య | ” |
| 5. శ్రీ పులి సీను | ” |
| 6. శ్రీ ఇవల పంగు మిన్నయ్య | ” |
| 7. శ్రీ కుంభం లింగయ్య | ” |
| 8. శ్రీ చుండూరు లక్ష్మిబాయి | ” |
| 9. శ్రీ గద్దె రామారావు | ” |
| 10. శ్రీమతి కొల్లు సక్కుబాయమ్మ | ” |
| 11. శ్రీమతి దేవులపల్లి సర్వమ్మ | ” |
| 12. శ్రీ నల్లమాద రాములు | ” |
| 13. శ్రీ నల్లమాద వెంకటేశ్వర్లు | ” |

కార్యదర్శి: దేవబత్తిని శ్రీనివాసరావు
మరియు సిబ్బంది

## కలకోవ ప్రాథమిక వ్యవసాయ సహకార పరపతి సంఘం

మునగాల మండలం, నల్లగొండజిల్లా

| | |
|---|---|
| 1. శ్రీ గన్నా కోటేశ్వరరావు – | అధ్యక్షులు |
| 2. శ్రీ తూము సైదయ్య – | ఉపాధ్యక్షులు |
| 3. శ్రీ బుర్రె బాబు – | డైరెక్టరు |
| 4. శ్రీ కొమ్మరాజు కనకయ్య | |
| 5. శ్రీ వెంపటి గురూజి | ” |
| 6. శ్రీ బుర్రె నర్సయ్య | ” |
| 7. శ్రీ పాతకొట్ల లింగయ్య | ” |
| 8. శ్రీ మామిడి పిచ్చయ్య | ” |
| 9. శ్రీ పాల వీరస్వామి | ” |
| 10. శ్రీ కేశబోయిన సోములు | ” |
| 11. శ్రీ పనస వెంకటేశ్వర్లు | ” |
| 12. శ్రీమతి గన్నా చుక్కమ్మ | ” |
| 13. శ్రీమతి సుంకర వాణి | ” |

కార్యదర్శి: పి. కనకమ్మ మరియు సిబ్బంది

## ఆకుపాముల ప్రాథమిక వ్యవసాయ సహకార పరపతి సంఘము (లి)

నెం. H.1159 ఆకుపాముల,
మండలం: మునగాల, నల్లగొండ జిల్లా.

| | |
|---|---|
| సర్వశ్రీ సుంకి లక్ష్మారెడ్డి | అధ్యక్షులు |
| ” పుల్లూరి వెంకటనారాయణ | ఉపాధ్యక్షులు |
| ” పల్లపురెడ్డి వెంకటరెడ్డి | డైరెక్టర్ |
| ” పోలంపల్లి వెంకటేశ్వర్లు తండ్రి గుర్వయ్య | |
| ” వెలిశెట్టి వెంకటేశ్వర్లు | ” |
| ” పోలంపల్లి వెంకటేశ్వర్లు | ” |
| ” లిక్కి నాగేశ్వరరావు | ” |
| ” బోళ్ళ ఆదిరెడ్డి | ” |
| ” లంజపల్లి ధనమూర్తి | ” |
| ” ఇంద్రగంటి శ్రీను | ” |
| ” మొగిలి చినపుల్లయ్య | ” |
| శ్రీమతి వల్లపురెడ్డి సుబ్బలక్ష్మి | ” |
| శ్రీమతి కాల్వ రాములమ్మ | ” |

కార్యదర్శి: రావూరి పూర్ణచంద్రరావు మరియు సిబ్బంది

## రేపాల ప్రాథమిక వ్యవసాయ సహకార పరపతి సంఘం

NO.H.909

మునగాల మండలం, నల్లగొండజిల్లా

పాలకవర్గ సభ్యులు:

| | |
|---|---|
| 1. శ్రీ గండ్ర వెంకటరెడ్డి – | అధ్యక్షులు |
| 2. శ్రీ సంగిశెట్టి కోటయ్య – | ఉపాధ్యక్షులు |
| 3. శ్రీ జాలకంటి కృష్ణారెడ్డి – | డైరక్టరు |
| 4. శ్రీ కుమ్మగుంటి పేరయ్య – | |
| 5. శ్రీ దొంగరి శ్రీనివాసరావు | ” |
| 6. శ్రీ కందిబండ కృష్ణమూర్తి | ” |
| 7. శ్రీ బెజవాడ కృష్ణయ్య | ” |
| 8. శ్రీ బాదావత వీరయ్య | ” |
| 9. శ్రీమతి దొంగరి సక్కుబాయమ్మ | ” |
| 10. శ్రీమతి లింగా ప్రమీల | ” |
| 11. శ్రీ సోమపంగు యాదయ్య | ” |
| 12. శ్రీ కత్తి పెదగోపయ్య | ” |

కార్యదర్శి: కె. సాంబశివరావు మరియు సిబ్బంది

ప్రస్తుతం నడుచున్న వాటిలో లోపాలు సరిదిద్ది మొత్తం ఆయకట్టుకు నీరిందించుటకు కృషి చేయాలి.

4. తుపాన్ వలన తెగిపోయిన చెరువులు మరియు కుంటలు మరమ్మతుకాకుండా 412 ఉన్నవి. వీటిని మరమ్మత్తులు చేయించుటకు పోరాడాలి.

5. భూగర్భ జల వనరులను వ్యవసాయానికి వాడుకొనుటకు సన్న, చిన్నకారు రైతులకు ఉచితంగా బోర్లు వేయించుటకు ఆందోళన సాగించాలి.



చంద్రరాజగోపాల్
జిల్లా కార్యదర్శి

6. వ్యవసాయానికిచ్చే కరెంటు గతంలో ఉన్న స్లాబ్ పద్ధతి ప్రకారంగా కొనసాగించుటకు మరియు దరఖాస్తు పెట్టుకొన్న ప్రతి రైతుకు ఉచితంగా కరెంటు సప్లై చేయుటకు ఆందోళన సాగించాలి.

7. భూమి సర్వే సెటిల్‌మెంట్ చేయుటకు మరియు పాస్‌పుస్తకాలు యిప్పించటానికి పోరాటం సాగించాలి.

8. ప్రభుత్వం ప్రకటించిన ఎరువుల సబ్సిడీని సన్నచిన్న కారు రైతులకు అందించటానికి పోరాటం సాగించాలి.

## నెల్లూరు

గతంతో పోల్చినపుడు జిల్లా వ్యవసాయరంగంలో అనేక మార్పులు చోటు చేసుకున్నాయి. ముఖ్యంగా సోమశిల ప్రాజెక్టు మొదటిదశ పూర్తియి 37 టి.ఎం.సి.ల నీరు ప్రాజెక్టులో నిల్వ వుండటంతో పెన్నా డెల్టాక్రింద 2వ కారుకు గ్యారంటీ ఏర్పడి లక్ష ఎకరములకుపైగా వరిసాగువుతున్నది. నదిమట్టుప్రక్కల గ్రామాల్లోనూ, డెల్టాలోనూ నీటిమట్టం పెరిగింది. ట్రాక్టర్ల వినియోగం గణనీయంగా డెల్టా, నాన్‌డెల్టా ప్రాంతాల్లో పెరిగింది. డెల్టా ప్రాంతంలోనూ, సముద్రతీరం వెంబడి చేపల, రొయ్యలపెంపకం పెద్ద ఎత్తున సాగవుతున్నది. బయట జిల్లాల నుంచి కూడా భూములు కొనేవారు రావడంతో సముద్రతీరంలో భూములకు మంచి ధర పలుకుతున్నది. ధనిక రైతులు ప్రధానంగా ఈ రంగంలో ప్రవేశిస్తున్నారు.

కోవూరు ప్రాంతంలో 10 వేల ఎకరములలో చెరకుసాగు వరికన్నా గిట్టుబాటు కావడంతో నిలదొక్కుకున్నది. మెట్టప్రాంతాలలో వాణిజ్యపంటలైన వేరుశెనగ, మిర్చి ఇతర పంటలు పెరిగాయి. మామిడి, దానిమ్మతోటలు విస్తరిస్తున్నాయి. పొగాకు పంట లాభనష్టాలతో కొట్టుమిట్టాడుతున్నది. మొత్తం మీద మెట్టప్రాంత రైతులకు లాభదాయకంగా వుందని చెప్పవచ్చు. మెట్ట ప్రాంతాలలోనే సపక, జామాయిల్ తోటల పెంపకం పెరుగుతున్నది. మెట్టప్రాంతాలలో మల్బరీ తోటలు అన్ని పంటలకన్నా లాభదాయకంగా వుంటున్నవి. రీలింగ్ కేంద్రం, మార్కెట్ దూరంగా వుండి ఇబ్బందుల నెదుర్కొంటున్నారు. మొత్తం మీద జిల్లాలో విద్యుత్‌వాడకం, మోటార్ల సంఖ్య పెరిగింది. గతంతో పోల్చినపుడు రసాయనిక ఎరువుల వాడకం పెరిగింది. ధాన్యం సగటు ఓగుబడి బాగా పెరిగింది. ప్రపంచ ప్రసిద్ధిగాంచిన మొలగొలుకు వరిధాన్యం పంట దిగుబడి తక్కువగావడంతో క్రమేణా తగ్గి ఐ.ఆర్.బి. వరి పెరిగింది. గూడూరు ప్రాంతంలో నిమ్మతోటలు నిలదొక్కుకున్నవి. జిల్లాలో కోవూరులో సహకార రంగంలో ఒక చక్కెర ఫ్యాక్టరీ, నాయుడుపేట వద్ద ప్రవేటురంగంలో మరో చక్కెర ఫ్యాక్టరీ వున్నది. మరో 10 చక్కెర ఫ్యాక్టరీలకు ప్రతిపాదనలు వున్నవి.

జిల్లాను ప్రధానంగా అతివృష్టి, అనావృష్టి, తుపాన్‌లు పీడిస్తున్నవి. డెల్టాలో డ్రైనేజి సౌకర్యం లేక రైతాంగం నష్టపోతుంటే మెట్టప్రాంతాలయిన ఉదయగిరి, కనిగిరి, కావలి, గూడూరు, వెంకటగిరి, రాపూరు ప్రాంతాలలో నీటి సౌకర్యం లేక వేలాది ఎకరాలు వర్షాధారంపై ఆధారపడి పంట పండక రైతాంగం చాలీచాలని ఆదాయాలతో బ్రతుకులీడుస్తున్నారు. సోమశిల ప్రాజెక్టు 2వ దశ పూర్తికావడం, కండలేరు ప్రాజెక్టు పూర్తికావడం కృష్ణపట్నం వద్ద 1000 మె.వా.సూపర్ థర్మల్ స్టేషన్‌ను నెలకొల్పడం, సీతారాంపురం రిజర్వాయర్ నిర్మాణం జిల్లా రైతాంగం అభివృద్ధికి కీలకాంశాలు.

### మన సంఘ కృషి

మన జిల్లా రైతుసంఘం ప్రధానంగా డెల్టాలో మురుగునీటి పారుదల సౌకర్యం కొరకు, నాన్ డెల్టాలో సీతారాంపురం రిజర్వాయరు సాధనకొరకు, ప్రకృతి వైపరీత్యాలు వచ్చినపుడు రైతాంగానికి సహాయమందించమని, చెరువుల సక్రమ నిర్వహణ కొరకు, కాల్వ చివరి భూములకు నీరందించమని బంజరు భూములకు నీరందించమని, బంజరు భూములను పేదరైతులకు పట్టాలిప్పించడంలోనూ ఇంకా అనేక స్థానిక సమస్యలపైన మన సంఘం ప్రధానంగా కృషి చేసింది.

గమనిక: కొన్ని జిల్లాల సమాచారం మాత్రమే ప్రచురించడం జరిగింది. మిగిలిన జిల్లాల సమాచారం వచ్చే సంచికలో ప్రచురించగలం



# బంగారపు హస్తం కాదు!
# భస్మాసుర హస్తం!

వాలంటరీ రిటైర్‌మెంటు అని, గోల్డెన్ షేక్ హ్యాండ్ అని నోరూరించే పేరుతో ప్రచారం జరుగుతున్నది. దీని అసలు బండారం ఇది. ఈ ఉద్యోగి 35 సంవత్సరాల సర్వీసు పూర్తి చేసినా లేదా 53 సంవత్సరాల వయస్సు దాకా పనిచేసినా అతనికి సర్వీసు కాలానికిగాను ముట్టేవి.

| | |
|---|---|
| జీతం క్రింద | రు. 3,71,620 |
| గ్రాట్యుటి | రు. 15,675 |
| కమ్యుటేషన్ | రు. 19,830 |
| పెన్షన్ | రు. 61,440 |
| ఫ్యామిలీ పెన్షన్ | రు. 53,400 |
| మొత్తం | రు. 5,21,965 |
| గోల్డెన్ షేక్ హ్యాండ్ | రు. 1,13,000 |
| అతనికి నష్టం | రు. 4,08,965 |




ఇంతేకాదు ఈ స్కీము క్రింద దిగిపోయిన వారికి పాస్ వుండదు. పెన్షన్ వుండదు. వైద్యసౌకర్యం వుండదు.

# TIRUMALA TIRUPATI DEVASTHANAMS

M.V.S. PRASAD, I.A.S.,
Executive Officer




TIRUPATI

*Dear devotee*

There is no gift worthier and nobler than annadana. In our country, giving food to the needy and poor is not merely a service, but a hoary tradition practised since vedic times. It is said that one who offers food is placed among the devas.

Sri Venkateswara Nitya Annadana Scheme, aimed at providing free and wholesome food to the devotees visiting Tirumala, launched by the T.T. Devasthanams in 1985, has become a glorious success. There has been an overwhelming response from philanthropists all over India.

The quality of food was also immensely appreciated by the public. The benefit of this unique Annadana scheme is now enjoyed by most of the pilgrims at Tirumala.

With a view to providing a wonderful opportunity to the common devotee to contribute his mite in the Nitya Annadana Scheme, the T.T. Devasthanams has recently decided to slash the slab considerably. Enough you just pay Rs. 1000 or in multiples and serve a noble and befitting cause, thus enabling T.T.D. to preserve the timeless tradition of Annadana.

If your heart goes out to those devotees coming from farflung areas, join the modified *Nitya Annadana Scheme* and have the pride of partnership in this sacred service.

Vedas affirm that food is life animating the inner energy. Annadana is a priceless measure transcending the earthly qualities. Annadana should, therefore, be done.

-Bodhayana Dharma Sutra.

Thanking you,

Yours sincerely,

**M.V.S. PRASAD.**

# రైతు (వీధినాటిక)

—కె.శాంతారావు

ఆంధ్రప్రజానాట్యమండలి ప్రదర్శించే వీధి నాటికల్లో రైతు వీధినాటిక విశిష్టమైనది. ఎవరయితే తమ సమస్యల పరిష్కారం కోసం సంఘటితంగా పోరాడుతున్నారో ఆ ప్రజల పోరాట వేదికలపై ఆయా సందర్భాల్లో ప్రదర్శించేదే "వీధినాటిక" కాని వీధుల్లో ప్రదర్శించిందల్లా వీధినాటిక కాదని ప్రజాకళాకారుడు అమరజీవి కామ్రేడ్ సప్దర్ హష్మీ చెప్పిన విషయం అందరికి తెలిసిందే. ఆ విధంగా చూసినపుడు 'రైతు' నాటిక నూటికి నూరుపాళ్ళు వీధినాటిక లక్షణాలను పుణికి పుచ్చుకుంది. రైతులకు ఒక పోరాట ఆయుధం అయింది.

1989లో ఖమ్మంలో జరిగిన అఖిలభారత రైతు మహాసభల సందర్భంగా విస్తృతంగా ప్రచారం చేయాలనే సత్సంకల్పంతో కామ్రేడ్ దేవేంద్ర ఈ నాటికను రచించాడు. 89 మార్చిలో ఉయ్యూరులో జరిగిన రెండ్రోజుల వీధినాటిక రాష్ట్ర శిక్షణా శిబిరంలో కామ్రేడ్ టి.జె.రామనాథం దర్శకత్వంలో ఈ నాటిక లఘునాటికగా రూపొందింది. ఆ తర్వాత 89 ఏప్రిల్ 12-16 తేదీల్లో ప్రజానాట్యమండలి రాష్ట్ర వ్యాప్తంగా నిర్వహించిన మహోజ్వల వీధినాటిక ప్రచారంలో వివిధ జిల్లాల్లో వందలాది ప్రదర్శనలతో ఆ రైతు నా[illegible] భాగస్వామ్యం అయింది.

మరల ఇప్పుడు మధిరలో జరిగిన రాష్ట్ర రైతు మహాసభ సందర్భంగా రైతు నాటికను సంపూర్ణంగా రూపొందించి ప్రచారంలో పెట్టాలని ఆంధ్రప్రజానాట్యమండలి ఖమ్మం జిల్లా కమిటి నిర్ణయం గైకొని ఆ బాధ్యతను మధిర డివిజన్‌కు అప్పగించింది. మధిర డివిజన్ కళాకారులు ఇద్దరు మహిళలతో [illegible]హా నారాయణపురం గ్రామంలో శిబిరం పెట్టుకుని అత్యంత [illegible]మశిక్షణతో కేవలం నాలుగురోజులలోనే ఈ నాటికను [illegible]ర్చుకున్నారు. రాష్ట్ర కార్యదర్శి శ్రీకె.శాంతారావు దర్శకత్వ [బా]ధ్యతను వహించారు. ఆ తర్వాత ఆ నాటికను మధిర చుట్టు [ప్ర]క్కల గ్రామాల్లో మండుటెండల్ని సైతం లెక్క చేయక [వంద]కి పైగా ప్రదర్శనలిచ్చి రైతుల్ని కదలించారు. పత్రికల ప్రశంసలు [అం]దారు. అక్కడితో ఆగక మే 18న గుంటూరులో సి.పి.ఐ. [ఆధ్వ]ర్యంలో ప్రత్తి రైతుల ధర్నా చేసే సందర్భంగా కూడా ప్రదర్శించి ఆ [పో]రాట రైతుల్ని ఆకట్టుకున్నారు.

**ఇది రైతు వీధినాటిక తెరవెనుక సంక్షిప్తగాథ**

ఈ నాటిక తెలుగు గ్రామీణ రైతాంగ జీవితానికి దర్పణం [ప]డుతుంది. సగటు రైతు కలలు, ఆశలు, బాధలు, కన్నీళ్ళు [ప్రత్య]క్షీకరిస్తూ కంట తడిపెట్టిస్తుంది. అందుకే నాటిక చివరలో ఓ [సూత్ర]ధారి ఇంతకీ ఈ నాటికలో సందేశం ఏమిటి గురూ? అని [ప్ర]శ్నిస్తే... అందుకు జవాబుగా సూత్రధారి నాటకానికైతే మనం [ము]గింపు చెప్పగలం. కాని ఇది జీవితం అందుకే సాదాసీదాగా నడిచిందికదూ (నాటకం) అంటూ ఉద్వేగభరితమైన ప్రేక్షకులకు జీవితం గంభీరత్వాన్ని వర్ణిస్తాడు రచయిత. అలాగే ఈ దోపిడీ వ్యవస్థలో పెట్టుబడిదారీ, భూస్వామ్యవర్గం ప్రయోజనాల మధ్య ఓ సామాన్య రైతు నలిగిపోతూ తనకు తెలియకుండానే తాను వ్యవసాయ కూలీగా దిగజారిపోతున్నదీ ఈ నాటిక అంతర్లీనంగా తెలియచెప్తుంది. బ్యాంకుల్లో అవినీతి, ఎరువుల కొట్లలో మోసం, మార్కెట్లోదగా అడుగడుగునా రైతుకుజరిగేఅన్యాయాన్ని వివరి స్తుంది. జీవిత సంక్షోభాన్ని కళ్ళెదుట నిలుపుతుంది. ఒక్కమాటలో చెప్పాలంటే తనగురించితాను చెప్పుకోలేని రైతు సాధకబాధలను ఈ నాటిక ఒక గంటలో స్పష్టీకరించడానికి ప్రయత్నిస్తుంది.

నాటికలో రైతు పాత్రకు న్యాయం చేకూర్చడానికి వెంకటేశ్వరరావు పడిన కష్టం కన్పిస్తుంది. అలాగే పరిణితి కల్గిన శ్రీరామారావు నటన, అహ్లాదకరమైన శ్రీకృష్ణ డప్పునృత్యం, శ్రీమతి సుభద్ర, పుష్ప తదితరుల పాత్రోచిత నటన నాటికకు వన్నె చేకూర్చాయి. శ్రీలక్ష్మినారాయణ ఈ బృందానికి సారధ్యం వహించారు.



# మనసు ఫౌండేషన్

## పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | RW01A109 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 22/8/23 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Sandhya |
| పేజీలు విడదీసినది | Sandhya |
| స్కాన్ చేసినది | Sandhya |
| పరీక్ష చేసినది | Amruth |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |